# విశ్వకవి

## (రవీంద్రనాథ టాగూరు)

రచయిత:
బొడ్డుపల్లి పురుషోత్తము, బి. ఏ. (ఆనర్సు)
తెలుగు లెక్చరర్ వి. ఆర్. యస్. కళాశాల,
చీరాల.




శ్రీ రామా అండ్ కో.
విద్యావిషయక ప్రచారకులు
చీరాల, గుం॥ జిల్లా.

 [వెల 1—0—0]

# పరిచయము



మహాపురుషుల మాన్యజీవితములు మానవాళికి మహిత మార్గమును జూపించు మహిమ కల్గినవి. ఆధునిక ప్రపంచ మహాపురుషులలో నగ్రగణ్యులు, గురుదేవులు శ్రీ రవీంద్రనాథ ఠాగూరు. కవిగా, గాయకుడుగా; మహాకవిగా, మహర్షిగా; వక్తగా, ప్రవక్తగా; త్యాగిగా, భోగిగా; నాతడు తన జీవితమునకు సమగ్రత్వము సంపాదించుకొనెను. తన్మూలమున ప్రపంచ విజ్ఞానమునకు తేజస్సును ఓజస్సును సంతరించినాడు.

అట్టి యీ కమనీయ మహనీయమూర్తి అఖండమగు ఆత్మీయత (Personality) పాదపాదమున ప్రతిబింబించుచున్న దీ జీవితచరిత్రదర్పణము. సంక్షిప్తమయ్యు విషయమునందు సంకుచితముకాదు. శైలి కుసుమకోమలమయ్యు పటుత్వమును కోల్పోనిది. శ్రీ గురుదేవుల జీవితమును విద్యార్థిలోకమున కపూర్వ రామణీయకముగ నందించి యీ రచయిత కృతకృత్యులైనాడు.

సుదర్శన మహల్, నెల్లూరు,
౨౫-౬-౧౯౪౮.

బెజవాడ గోపాలరెడ్డి.

# ముందుమాట



స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత భారత దేశమునకుఁ గల ప్రతిష్ఠ, పలుకుబడి, పెద్దఱికము అంతర్జాతీయముగ మిక్కిలిగా నభివృద్ధిఁ జెందినవి. దేశము పరతంత్రమైననాఁడు, అంతర్జాతీయ సంస్థలలో భారత దేశమునకు ప్రవేశము కలుగ నీయవచ్చునాయని పరదేశవాసులు సందేహించు కాలమున నాత్మతేజో విరాజమానులై, భారతీయ గౌరవమును నిలువఁ బెట్టి, వైజ్ఞానిక పతాకను, అసహాయశూరులై యెగురవేసిన వీరులు వివేకానందస్వామి, రవీంద్రనాథ టాగూరు, మహాత్మా గాంధి. ఈ మహావీరుల యశశ్శరీరములు, పరిశుద్ధ సత్త్వ మూర్తులై నేటి భారతీయ యువకుల జీవన పథములను దిద్దఁ గలవియై యున్నవి. ఆర్ష భారతీయ వాఙ్మయసారము నవ్య రూపమున రవీంద్రుని మూర్తిలో వెల్వడి, ప్రపంచమునకు విభ్రాంతిఁ గొల్పినది.

అట్టి మహామహుని చరిత్రము యువకుల కుపాదేయము. దానిని వ్రాయుటకు పాండిత్యము, భక్తి, శక్తి, మూఁడును గావలయును. అట్టివి ఈ గ్రంథరచయితకుఁ గలవని గ్రంథము చదివిన వారి కెల్లఱకుఁ దెల్లము. యువకులు దీనిని చదివి తప్పక ఉన్నత భావములకు స్థానము కాఁగలరని విశ్వసించు చున్నాను. ఇది ఉన్నత పాఠశాలలోని విద్యార్థులకుఁ బఠనీయ ముగా నుండుటకు నన్ని విధముల సనునైయున్నది.

విశ్వకళాపరిషత్,
వాల్తేరు,
31—10—1958.

విద్వాన్ గంటి జోగి సోమయాజి,
ఎం. ఏ., యల్. టి,
ప్రొఫెసర్ – ఆంధ్రభాషాశాఖాధ్యక్షులు.

౧

అదిగో సత్యము శివము సుందరమునైన ప్రశాంత దివ్యధామము శాంతినికేతనము!! అందెవ్వరా లోకమోహన దివ్యమంగళమూర్తి? ఎవ్వరా రాకాసుధాకరుఁడు? భారతీయ పరిజ్ఞానామృతము జాలువారు నాకేశసంపద; అదృష్టరేఖలఁ దీర్చిదిద్దుకొనిన విశాలఫాలభాగము; విద్యుద్ద్యుతుల నీను నల్లకలువలవంటి కన్నుదోయి; నవనవోన్మేషమగు ధీకుశలతను వ్యక్తపఱుచు నాసికాగ్రము; శిశుమనోనైర్మల్యమునకుఁ బ్రతిబింబములైన దరహాస చంద్రికలు నర్తించు మధురాధరములు; ఆజానువులగు బాహువులు; సుకుమారములు, సున్నితములునైన యంగుళులు; గభీరహృదయ చిహ్నమగు విస్తృతవక్షస్థలము; వెన్నకంటెను, వెన్నెలకంటెను, మృదులము మంజులమునైన గాత్రసంపద గల యీ మధురమూర్తి మహితసందర్శనమే రూపుగొన్న లలితకళల సాక్షాత్కార సౌభాగ్యము.

ప్రకృతిదేవి యరుణారుణ చరణారవిందములకు భక్తిమీర సపర్యలు సల్పిన సేవకుఁడాతఁడు. ఆవేశ మధుర గీతాంజలులతో విశ్వకవితావిపంచీ నినదముల విరజిమ్మిన విశ్వకవి; వివిధ లలితకళోపాసనాచణుఁడై తద్విధానమును సుబోధమొనర్చిన మహామహోపాధ్యాయుఁడు; దేశదాస్య విముక్తికై తహతహలాడిన యుత్తమ దేశభక్తుఁడు; స్వార్థరహితమైన ప్రేమ స్వభావముతో మానవ హృదయములఁ

ప్రేమజ్యోతుల వెలిగించిన మహిమాన్వితుఁడు; అనంత సత్య సాగర మథనము గావించు తత్త్వజ్ఞులలో తత్త్వవేత్త. త్యాగ భోగములఁ దుల్యానంద మనుభవించగల స్థితప్రజ్ఞుఁడు. ఋత వాదనములు సల్పు ఋషులతో ఋక్సామములఁ బఠించు ఋషిసత్తముఁడు. తపోనిష్ఠాగరిష్ఠుఁడై యాత్మానంద సంసిద్ధి గాంచిన జ్ఞానయోగి; ఆదర్శ కర్మాచరణమున స్వర్గసౌఖ్యమును కరతలామలకము గావించుకొనిన కర్మయోగి; శాంతినికేత నాశ్రమోపవనమున 'విశ్వభారతి'ని ప్రతిష్ఠించి విశ్వమానవ కళ్యాణసాధనకై యాత్మ నంకితమొనర్చిన పుణ్యమూర్తి, గురుదేవులు, శ్రీ రవీంద్రనాథ టాగూరు. ఆ మహామహుని జీవితము 'కవికోకిల' శ్రీమతి సరోజనీదేవి పేర్కొనినట్లు మహిమ యశోవిలసితమైన యొక దివ్యగాంధర్వగాథ.

## ౧

రత్నాలగనిలో రత్నమే లభించును. అటులనే రవీంద్ర కవిరత్నము టాగూరువంశ రత్నఖనిలోని జాతిరత్నము. ఆ వంశము వంగదేశేతిహాస సౌభాగ్యరేఖల నితోధికముగఁ దీర్చి దిద్దినది. 'అచట పుట్టిన చివురు కొమ్మైన చేవ' యను సామెతకు ప్రబల నిదర్శనముగ నిల్చినదా వంగదము. వారి యింట లక్ష్మీ సరస్వతులు పరస్పర సౌమనస్యముతోఁ గాపురము చేసిరి. లలితకళాశ్రీ వారి గృహమునఁ జిఱుగజ్జియలతో

సర్తించినది. కలకత్తా నగరమున నేఁటికిని వారి విశాలభవన సందర్శనమున తత్ప్రాభవోన్నతులు సంస్మరింపనగును.

రవీంద్రుని పితామహుఁడు శ్రీ ద్వారకనాథ టాగూరు; అధిక శ్రీమంతుఁడయ్యు దర్పితుఁడుకాఁడు; పేదల పాలిటి పెన్నిధానము. తనమాగాణులలోని సస్య సౌభాగ్యముల నాతఁడు దయార్ద్ర హృదయముతో రాసుల కొలఁది పేద సాదలకు దోఁచిపెట్టెడివాఁడు.

ఆశ్రిత కామధేను వాతఁడు. ఆగంతుకులకు సులభోప సర్పణీయుఁడు. తన సహాయము నపేక్షించు నట్లణుమాత్రము గ్ధుర్తించిన చాలును, వెనుకంజ లేక యెట్టి దుర్ఘట కార్యముల నైన సులభముగ సాధించిపెట్టును.

ఒకానొక సమయమున నొక న్యాయాధికారి యత్యవస రముగ నాంగ్లదేశ మేగవలసివచ్చెను. ఆ తఱి నెటిఁగి కుటిలుఁ డగు ఋణదాతయొక్కఁడు తన కీయవలసిన ధనమంతయుఁ జెల్లిం చినగాని కాలు కదపనీయనని మొండిపట్టు పట్టెను. న్యాయాధి కారి కేమియు తోఁచలేదు. ఆదినమున వ్యాకుల మనస్కుఁడైన యాతఁడు ద్వారకనాథునితో వాహ్యాళి వెడలెను. సందర్భవశ మున తన మనోవాంఛను ద్వారకనాథునకు గుంభనముగ వ్యక్త మొనర్చెను. నాథుని హృదయమున జాలి గల్గినది. కాని యది వాగ్రూపమున వ్యక్తపడలేదు. 'ఊ' కొట్టుమాత్ర మప్పటికి యూరకుండెను. మఱునాఁ డుదయముననే ద్వారకనాథుఁ డొక శ్లిష్ట మొత్తమును 'చెక్కు'గా ఋణదాత కేతెంపి, తన ఋణ

ధనమును గైకొని మిగిలినదానితో న్యాయాధికారి కెట్టి కొఱఁతయుఁ గల్గకుండ నాంగ్లదేశ యానమున కవసరమైన సర్వ సంభారముల సమకూర్చవలసినదిగా నాతని నాదేశించెను. సర్వజనమాన్యున కీవిషయము తెలిసినందుల కే ఋణదాత సిగ్గున తలవంచెను. ద్వారకనాథుని మిత్రసమాదరణమునకు న్యాయాధికారి హృదయపూర్వ కాంజలి ఘటించెను. ఇట్టినిదర్శనములనేకములు. వేయిమాట లేల? 'పరహిత రతమతి యగుదాత నుదార' మన ద్వారకనాథుఁడన్న నతిశయోక్తి యిసుమంతయు లేదు.

ఈతని యుదాత్త సద్గుణపుంజములకుఁ బరప్రభుత్వము కూడ తలయూపి మేటి బిరుదము లొసంగి సత్కరించినది. బహుముఖములైన ప్రజాహిత కార్యనిర్వహణమున ప్రభుత్వమీతని సలహాలను శిరసావహించినది.

ద్వారకనాథునిలో గల మఱియొక మహాసద్గుణము— ముచ్చటించి మురిసిపోవలసినది – జాతీయతా పరిరక్షణము. భారతీయులు స్వధర్మ విజ్ఞానములఁ బూర్తిగా విస్మరించిన దినములవి. భారత జాతీయ జీవనము పరానుకరణ రూప దాస్యమునకు బలియాయెను. ధర్మగ్లాని, యధర్మవ్యాప్తి ప్రబలమగుచుండెను. ఇట్టి క్లిష్ట పరిస్థితులలో ద్వారకనాథుఁడు విజ్ఞతతో నాదర్శ జాతీయ జీవితమును గడపెను. తన విదేశ యానముల యందును నాతఁడు స్వదేశ సంప్రదాయముల విడనాడలేదు. సోదర దేశీయులు జాతీయ సముద్ధరణమునకు

నిర్వహించు ప్రతి యుద్యమమునకు నీతఁడు పెట్టని కోటగానుండి భూరి విరాళములొసఁగి పోషించెడివాఁడు. తన యంత్యదశ యందును నొకానొక జాతీయసంస్థ కీతఁడు లక్ష రూప్యముల విరాళ మొసంగెనట!! ఇట్టి మహాదాత కావుననే లోకులీతనిని "మహారాజా!" యని భక్తి విశ్వాసములతో సంబోధించి సమాదరించెడివారు.

అట్టి యీ మహాపురుషుని జీవయాత్ర తుది యాంగ్లదేశ యాత్రా సందర్భమున సమాప్తమాయెను.

## 3

ద్వారకనాథుని కుమారుఁడు, రవీంద్రుని ప్రియజనకుఁడు శ్రీ దేవేంద్రనాథుఁడు. ఆస్థిపాస్థులకే కాక జనకుని యుదాత్త సద్గుణరాశికి నీ పుత్రుఁడు వారసుఁడు. విశ్వదాతయగు తన తండ్రి గావించిన యనేకఋణములను జిల్లిగవ్వతో సహా చెల్లించి, ధర్మతత్పరమైన తన ప్రవర్తనను లోకవిదిత మొనర్చి వంశప్రతిష్ఠను నిలిపెను. ఈతఁడును తన యావికొలఁది ధార్మిక సంస్థలకు విరాళముల నిచ్చెను. క్రమక్రమముగ నాతఁడు వినిర్మల ధర్మకర్మాసక్త హృదయముతో బ్రహ్మజ్ఞాన సమాలీఢ తేజుఁడై "మహర్షి" యను నన్వర్థబిరుదమందెను.

మహర్షి బాల్యజీవితమున జరిగిన యొకానొక సంఘటనము సువర్ణాక్షరముల లిఖింపఁదగినది. మూఢవిశ్వాసాంధ

కారావృతులైన హైందవులను సంస్కరించుట కవతరించి, నవయుగధర్మ ప్రవక్తగా శ్రీ వివేకానందస్వామి జోహారులం గూడ నందిన ప్రథమ భారతీయ మహాసంస్కర్త శ్రీ రాజా రామమోహనరాయలు కదా!! ఆతఁడు బ్రహ్మసమాజ మత స్థాపకుఁడై యుపనిషద్గతమగు నేకేశ్వరోపాసనమును బ్రధాన ముగ బోధించెను.

ఒకానొక సాయంసమయమున కలకత్తా నగరమున తన గృహారామమున రామమోహనుఁ డూయెల నూగుచు భావాంబరవీధిని విహరించుచుండెను. అప్పుడే బాలుఁడగు దేవేంద్రుఁడు తన తల్లిదండ్రుల వెంట నా యారామమునకు వచ్చెను. బాలుఁ డూయెలపై గల యుబలాటముతో వెనుక నుండి సమీపించి రామమోహనుని తన మృదుల హస్తము లతో నూపెను. రామమోహనుఁడంత వెనుదిరిగి చూచి పసివాని బ్రహ్మవర్చస్సునకు ముగ్ధుఁడై నిర్భరానందమున నూయెల దిగి యాతని నందు కూర్చుండబెట్టి యూపి ముద్దు లాడెను. ఈ యలతి సంఘటనము నందెంతటి మహితార్థము కలదో! "నా యనంతరము బ్రహ్మసమాజ పరమార్థమును రక్షించి ప్రచార మొనరింపవలసిన గురుతరబాధ్యతను నీ కప్ప గించుచున్నాన"ని చెప్పకయే చెప్పుట కదా!!

మోహనుని యవ్యక్త మనోవాంఛను మహర్షి తన జీవితమున నీడేర్చి ధన్యుఁడాయెను.

బాహ్య కార్యకలాపముల నిర్వర్తించుకొనుచున్నను 'మహర్షి' హృదయము సర్వదా యీశ్వరాంకితమై యుండెడిది. ప్రశాంత ప్రకృతి వాతావరణము నీశ్వర నికేత నముగా భావించి యప్రయత్నముగ ధ్యాన నిమగ్నుఁ డయ్యెడివాఁడు.

అది ప్రదోష సమయము. అరుణ కిరణముఁ డల్లనల్లన నస్తాద్రిచాటున కరుగుచుండెను. కలకత్తా సమీపమున ప్రకృతి సౌందర్య సంశోభితమగు భోల్‌పుర ప్రాంతమున మహర్షి కార్యాంతరమున సంచరించు చుండెను. అచటి నిర్మల వాతా వరణరామణీయకము మహర్షిని ధ్యానోన్ముఖుని కావించెను. ప్రకృతి తానై యాయత్త పఱచినదో యనునట్లు, లతా సంవృతమై, వివిధ పుష్పాలంకృతమై వేదికవలె నొప్పునొక్క శిలాస్థలి నాసీనుఁడై మహర్షి తనమనస్సును బ్రజ్ఞాన బ్రహ్మ మునఁ గ్రమక్రమముగా సుప్రతిష్ఠితము చేసెను. ఈ యాత్మార్ప ణమునకుఁ బ్రకృతిమాత బరమానంద భరితమైనది. సకల కళామూర్తి విహాయస పథమునుండి యమృత హస్తములతో నాతని నభిషేకించెను.

కాలచక్రము గిఱ్ఱున తిరిగినది. బాలభానుఁడు తన మృదులారుణ కిరణముల నాత్మానంద సాగరమగ్నుఁడగు మహర్షిని మెల్లన మేల్కొల్పెను. తటాలున నాతఁడు తన యోగ నిద్రనుండి లేచి తనకుఁగల్గిన యనుభూతికి తానే విభ్రమ మందెను. ఆ ప్రదేశమంతటి మహిమోపేతమైనదని గుర్తించి

దాని నాతఁడు తన తపోభూమి కావించుకొనెను. దాని కా మహనీయుఁడు "శాంతినికేతనమ"ని నామకరణముగూడఁ జేసెను. ఆ ప్రదేశ మాదినములలోఁ దత్ప్రాంత ముముక్షువుల కాత్మశాంతి నొసఁగిన పుణ్యక్షేత్రము. అనంతరమది దేశకాలావధుల నతిక్రమించి ప్రాక్ప్రతీచీ సచ్ఛాత్రసమితికి విద్యామృతమును బంచిపెట్టిన యమృత సత్రమాయెను. అంతియ కాదు; తుద కయ్యది సర్వ లలితకళానిలయమై విశ్వభారతీ నికేతనమై మానవునకు దివ్యానందమును బ్రసాదింపఁగల స్వర్గఖండమై భూదేవి తపఃఫలముగాఁ బరిఢవిల్లినది.

లోకము సాధారణముగఁ దలంచునట్లు సంసారమున సారము గావించుకొని త్యజించిన మహర్షికాఁడు దేవేంద్రుఁడు. దానిని ససార మొనర్చుకొని యజ్ఞమువలె నిర్వహించిన ప్రతిభాశాలి. అతని కడుపు బంగారు పంట పండినది. పదునల్గురు సంతానము. అందు కడగొట్టు గారాబుపట్టియే రవీంద్రనాథ టాగూరు. పదునెనిమిదివందల అఱువదియొక్క సంవత్సరము మే మాసము ఏఁడవ తేదిని యవతరించెను.



రవీంద్రుని జననము నాఁటికే టాగూరు కుటుంబ మార్థికముగాఁ గుంటువడినది. అయినను నిండువగట్టిన గుడ్డకదా!! రవీంద్రుని సోదరీ సోదరు లున్నతవిద్యా ప్రవీణులు. ఒకఁడు

వేదాంతమున, వేఱొకఁడు సంగీతమున, నింకొకఁడు సాహిత్యమున ప్రత్యేకాభినివేశముల సంపాదించి కుటుంబ గౌరవము నినుమడింపఁ జేయుచుండిరి.

రవీంద్రుని బాల్యజీవిత మధురగాథలను రవీంద్రుఁడే తన గ్రంథములఁ బ్రస్ఫుటీకరించుట మన యదృష్టము. "నాబాల్యస్మృతులు" "నాబాల్యదినములు" నను పుస్తకములు ప్రత్యక్షముగను "నెలవంక" యను కావ్యము పరోక్షముగను రవీంద్రుని బాల్యజీవిత ప్రతిబింబములై దివ్యకాంతుల వెదజల్లుచున్నవి.

మహర్షి సంతానము బహు నిరాడంబరముగఁ బెరిగినది. వారాఁడుకొనుటకు కృత్రిమమగు నాటవస్తువులు లేవు. బాలురు తమ యాటవస్తువులను దామే తమ బుద్ధికుశలత కొలఁది నిర్మించుకొనవలయుననియు, నందువలన వారిలోని సృజనాశక్తి పెంపొందుననియు మహర్షి మతము. ఇట్టి యేర్పాటులో గల వివేకమును రవీంద్రుఁడు పెద్దవాఁడగు కొలఁది గుర్తించి ప్రశంసించెను. నేఁడు ధనికుల కుటుంబములలో నాటవస్తువుల కగు ధనమంతయు నిరుపయోగమగుట శోచనీయాంశము కదా !

టాగూరు కుటుంబ విధానములన్నియు గుణవంతములని తలంపరాదు. అందనేకములు సంకుచితములైనవి. పిల్లలకానాఁడు బాహ్యప్రపంచమే తెలియదు. గృహకవాటముల దాటుటకే వారి కవకాశము లేకుండెను. వారి కిల్లొక

“బందిఖానా.” అందుచే వారు స్వేచ్ఛగా సంచరించు సేవకుల జీవితములే తమ జీవితములకన్న సుఖతరములని భావించెడి వారు. ఆనాడు కలకత్తానగరమున ట్రాములుగాని, రిక్షాలుగాని లేవు. ధనవంతు లలంకరించిన హయశకటములపై వాహ్యాళి వెడలెడివారు. ‘టకటక’ యను శబ్దములతో శకటములు గతితప్పక గంతు లిడుచుండ నిర్బంధములో నున్న బాలకుల లేతగుండెలు స్వేచ్ఛకై ‘కటకట’ లాడెడివి. బాల రవీంద్రుడు తన భవనములో నొక ‘వసారా’ మూల ‘కిటికీ’ క్రింద నొంటరిగఁ గూర్చుండి ప్రొద్దు పుచ్చెడివాఁడు. వానికి పట్టణమున వివిధగతులఁ బరిగెడు శకటధ్వానములు, పూలు, కాయలు నమ్మువారల వేలువేలు గొంతులు, వింత వింతగ నుండెడివి. అతనిదృష్టిలో గృహేతర ప్రపంచమంతయు నొక దివ్యలోకము. దానిని సందర్శించు భాగ్యమునకు తాను నోచుకొనలేదని రవి యొకింత విచారించెడివాఁడు.

బయటి కేగుటకు వీలులేకున్న పోనిండు. ఇంటనైన బాలురకు వలసినంత స్వేచ్ఛ లేకుండెను. పెద్దల ప్రపంచము పెద్దలది; పిన్నల ప్రపంచము పిన్నలది. దానికిని దీనికిని హస్తిమశకాంతరము. పెద్దలు పిన్నలను ప్రీతిపూర్వకముగఁ జేరఁబిల్చి ముచ్చటకైన ముద్దాడరు. ఉండఁబట్టలేక యెప్పుడైన పిన్నలు ధైర్యము చేసి పెద్దలను జేరిన, చిరాకుతో “పోండు, హాయిగా నాడుకొనుఁడ”ని పంపింతురు. వారట్లుపోయి యాడుకొనుచున్న “అబ్బా!! యేమి గోలరా!” యని విసుగుతో నావలకుఁ దరు

ముసురు. మొత్తముమీఁద టాగూరు కుటుంబమునఁ బెద్దల యభివృద్ధికున్నన్ని సౌకర్యములు పిన్నలకు సున్నయని చెప్పిన సత్యదూరముకాదు.

ఈ కుటుంబమున మఱియొక లోపము "సేవకుల పెత్తనము." సేవకులలోఁ బ్రశంసాపాత్రుఁడు వ్రజేశ్వరుఁడు. ఇతఁడు బ్రాహ్మణుఁడు. ఒకప్పుడు వీధిబడిలో పంతులుపని జేసినవాఁడు. శివిగల జీవి. అతనికీ సర్వప్రపంచము పంకిలముగాఁ గనుపించెడిది. పరిశుభ్రతకై యహర్నిశలు బ్రాకులాడెడివాఁడు. ఆతని యుచ్చారణ మదియొక వింతయైనది. రవి, యతని సోదరుఁడు సోమేశ్వరుఁడు, మేనకోడలు సత్య యీతని కప్పగింపఁబడిరి. ఈ ముగ్గురు పిల్లలను గాపాడుటాతనికి బ్రాణ సంకటముగా నుండెడిది. సాయంసమయముల యందీతఁడు వీరల నొక్కచో చేర్చి రామాయణ మహాభారత కథలను జదివి వినిపించెడివాఁడు. కథాశ్రవణముకొఱ కితర సేవకులు తీరికచేసికొని వచ్చెడివారు.

సభ్యులాశ్చర్యముతో నోళ్ళు తెఱచుకొని కథల నాలకించెడివారు. అన్ని కథలయందును రవిబాలు నాకర్షించినది "లవకుశుల వృత్తాంతము." దాని నాతఁడాజీవితము విస్మరింపలేదు. రవీంద్రుఁడు కవీంద్రుఁడై కథారచనము చేయుచున్నపుడు వ్రజేశ్వరుని మూర్తి యాతని మనోనేత్రముల నిల్చెడిదట! ఆహా! ఆదర్శ కథాకథన మహాత్మ్యమెట్టిదో! శివాజీ, వివేకానంద, గాంధీమహాత్ముల నంతటివారలఁ

గావించిన దీవీరగాథలే కదా ! వానిని నేఁటి నాగరక ప్రపంచము పుక్కిటి పురాణములక్రింద త్రోసిపుచ్చుటయే మన జాతికి దౌర్భాగ్యహేతువు !

మహాకవి రవీంద్రుఁడు తన బాల్య జీవితపరిస్థితి నొక్క గేయమున ధ్వనింపఁజేసెను. దాని భావమిది :—

" రెండు పక్షులు. అందొకటి పంజరబద్ధమైన పెంపుడిది. వేఱొకటి స్వేచ్ఛావిహారి; కాననివాసి. విధివశమున నీరెండు పిట్టలు నొకనాఁడు కలిసికొనినవి.

అడవిపిట్ట : మిత్రమా !! హాయిగా నడవికిపోయి విహరింతము రమ్ము !!

పెంపుడుపిట్ట : మిత్రమా !! మనమిరువురము పంజరమున మధుర ఫలముల నాస్వాదింతము రమ్ము!

అడవిపిట్ట : ఆ సంకుచిత ప్రదేశములో రెక్కల విప్పుచ్చుటకు కూడ వీలులేదుకదా ! అందు జీవించు టెట్లు !!

పెంపుడుపిట్ట : అయ్యో ! ఆలంబనమే లేని యాకాశమున విశ్రాంతి తీసికొను టెట్లు ? పంజరమున మన కెట్టి భీతియులేక మనవచ్చును ! రమ్ము పోదము !!

# ౫

బడికిపోవు నీడురాకమునుపే రవిబాబు బడికేఁగుట కుబలాటపడెను. గృహ మనుకారనుండి విముక్తిఁ జెందుటయే యాతని యుబలాటమునకు కారణము. కాని యచిరకాలమున నే యాతనికి గృహమే విద్యాలయముకన్న మేలని తోచెను. దండధరుఁడైన యుపాధ్యాయుఁడు బాలురపాలిటి సాక్షాత్ దండధరుఁడే యాయెను. సాటి విద్యార్థుల వర్తనముకూడ రవీంద్రునకు నచ్చలేదు. వెంటనే యాతఁడీ విద్యాలయమునకు వీడ్కోలొసంగినాఁడు.

ఇంటివద్దనే రవీంద్రునకు నిష్ఠురమగు ప్రణాళికతోఁ గూడిన విద్యావిధాన మేర్పఱుపఁబడెను. ఆ సమయమున తండ్రి యెక్కువగ నింటిపట్టున నుండెడివాఁడుకాఁడు. అందుచే “బాలుర విద్యాశాఖ”పై సర్వాధికారమును రవీంద్రుని మూఁడవ సోదరుఁడు హేమేంద్రుఁడు వహించెను. పిల్లలు చిన్నతనమునుండియుఁ జక్కని పఠనాపద్ధతుల కలవాటు పడవలయు ననియు, నుదయమునుండి యస్తమయము వఱకు వారు విద్యాసక్తులై వివిధ విద్యాశాఖలలోఁ బ్రవీణులు కావలయుననియు నాతని యాశయము. తన యాశయ సిద్ధికై యాతఁడు సమర్థులగు నుపాధ్యాయుల నింటికిఁ బిలిపించి చదువుఁ జెప్పించుచుండెను. విజ్ఞుఁడగు హేమేంద్రుఁడు సర్వవిషయ బోధనము నాంగ్లమునఁగాక మాతృభాషలోఁ గావింపఁజేసెను.

హితమగు భోజనమువలె హితమగు విద్య ప్రతివానికిని మాతృభాషలోనే యబ్బునను విషయమున తనసోదరుడే తన కాదర్శమని రవీంద్రుడు తరువాత చెప్పినాడు.

వంగభాషా సాహిత్యము, గణితము, ప్రకృతిశాస్త్రము మున్నగు విషయములు క్రమమున రవీంద్రునకు ప్రత్యేకోపాధ్యాయులచే వేఱువేఱు కాలములందు బోధింపబడినవి. ప్రకృతి శాస్త్ర పఠనమన్న రవీంద్రునకుఁ బ్రత్యేకాసక్తి. వింతవింత వస్తువులఁ జూపుచు పాఠముల బోధించుచున్నపుడు పరవశుఁడయ్యెడివాఁడు. సాయంతన సమయములలో వ్యాయామ శిక్ష నందెడివాఁడు. భోజనానంతర మాంగ్లమును బఠించెడివాఁడు. ఊపిరాడని విద్యాభారమున బాలరవి నీరసించెడివాఁడు. అందుచే నాంగ్ల పఠన మాతని కాసక్తి గొల్పెడిది కాదు. ప్రతిపాఠము నెత్తిపైన తాటికాయంత యక్కరములతో నాంగ్ల పదములు, ఉచ్చారణాసూచికలతో నుండెడివి. అవి వానికి బారులుతీర్చిన సిపాయిలవలె భీతిగొల్పెడివి. ఎట్లో ప్రాణములు బిగబెట్టుకొని తొమ్మిదిగంటలవఱకుఁ గాలము గడిపెడివాఁడు. తొమ్మిది మ్రోగీమ్రోగకమునుపే రవి పుస్తకములను గిరాటుకొట్టి పఱుగునఁ దల్లియొద్ద చేరి యొక్క కథఁ జెప్పుమని మారాము చేసెడివాఁడు. కథ కంచికి పోకమున్నే నిదురపెద్దమ్మ నెత్తికెక్కెడిది.

ఈడుకుమించిన విద్యాభారమును మోయఁజాలక రవి తప్పించుకొనుటకు మార్గములను వెతకెడువాఁడు. ఉపాధ్యా

యునకు జ్వరము తగిలి రాకున్న బాగుండునని వేయి దేవుళ్లకు మ్రొక్కెడివాఁడు. కాని యా పంతులయఃపిండమువంటి దేహ పటుత్వము గలవాఁడగుటచే పొరపాటునఁగూడ రవి కోర్కె ఫలించెడిదికాదు. కుంభవృష్టియందును నాతఁడు గొడుగు వేసి కొని చదువుఁ జెప్ప వచ్చెడివాఁడు. కాని నేటివారివలె సాకు దొరకిన చాలుగదాయని కర్తవ్యపథమునుండి నైదొలఁగెడి వాఁడుకాఁడు.

ఇట్టి క్లిష్టపరిస్థితులలో రవీంద్రుఁడే యాత్మ రక్షణో పాయమును జూచుకొనెడివాఁడు. ఎచటినుండి వచ్చెడిదో యేమో! పంతులు రాగానే యప్పటికప్పుడు "అమ్మా!! కడుపు నొప్పి"యని మూల్గెడివాఁడు. బిడ్డమనసు నెఱిఁగిన తల్లి యొజ్జ నాపూటకు వీడ్కొలిపెడిది కాని, బిడ్డలను బీడించి చదివించెడిది కాదు.

చిన్ననాఁటినుండియుఁ బద్యములల్లుటన్న రవీంద్రునకు మక్కువ యెక్కువ. శబ్దాలంకారములతో శ్రావ్యముగనుండు పద్యములే కవనమని యాతని నానాఁటి యభిప్రాయము. తనకైఁత నెట్టి జంకును గొంకును లేక వినువారలున్న విని పించెడువాఁడు. కరుణరస భరితములగు సంఘటనలే యాతని హృదయము నధికముగ నాకర్షించి కవిత్వమునకు విషయము లైనవి. శబ్దాలంకార భూయిష్ఠములగు నీతని పద్యములు చదివి సోదరులు, సోదరమిత్రులు పరిహసించెడివారు. వాత్సల్య రసోల్ల సిత మూర్తియగు జనకుఁడు మందహాసముతో లోలోన చదివి

యానందించెడివాఁడు. పసిపాపల బొమ్మల పెండ్లిండ్లలో నీ బాలకవిశేఖరుఁడు స్వీయ కావ్యగానమున సభ్యుల సంతోషపఱచెడివాఁడు. పెద్దలెవరైన వినోదార్థమిచ్చు సమస్యలను బూరించి ప్రశంసలందెడివాఁడు. ఈ తీరున బాల్యముననే రవీంద్రుఁడు పద్యరచనాచణుఁడై, క్రమక్రమమున మహోన్నత భావుకుఁడై, భావికాలమున విశ్వకవిగా విశ్రుత కీర్తి నార్జింపఁగల ప్రాతిపదిక నేర్పఱచుకొనియెను.

రవిబాబు కళాభిరుచి యొక్క కవిత్వమునకే కట్టుబడలేదు. అభినయమందును నాతని యభిమాన మభివర్ణనీయము. తానాన్నాఁడు తిలకించిన "నలదమయంతుల" రూపక మాతని మృదుల హృదయఫలకమున శాశ్వతముగ హత్తుకొన్నది. ఇట్టి భావనాత్మకమగు నభినయ పిపాసతో నాతఁడు తన విశ్వవిద్యాలయ విద్యార్థులలో నొక విద్యార్థియై నటించెడివాఁడు. కళోపాసకు లాజీవిత విద్యార్థులు. వారి హృదయములు ప్రభాత మారుతమువలె స్వచ్ఛందములు; స్ఫటిక శిలలవలె స్వచ్ఛములు; నవవికసిత కుసుమములవలె సుకోమలములు. అట్టి వారే జాతి కుజ్జీవనమును గల్గించువారు. వారిని పూజించుటే జాతికి తేజస్సు.

## ౬

రవీంద్రుఁడు పుట్టినప్పటినుండియుఁ బట్టిన పదిరోజులు గట్టిగా దేవేంద్రుఁ డింటిపట్టున నుండుటయే తటస్థింపలేదు.

ఆత్మోద్ధరణకో, దేశోద్ధరణకో, యాతఁడు నిరంతరము దేశాటనముఁ జేయుచునే యుండెడివాఁడు.

రవీంద్రుఁడు సుమారు పండ్రెండు వర్షముల ప్రాయమువాఁడు. మహర్షి దేవేంద్రుఁడు హఠాత్తుగా నింటికేతెంచెను. వచ్చినదే తడవుగా హైందవ ధర్మమునకు జీవగఱ్ఱయగు "ఉపనయన మహోత్సవము"ను రవికి జరిపింప సుముహూర్తము నేర్పరించెను. వేదాంత వాగీశుఁడను బండితుఁడు సహాయము చేయగా నుదాత్తానుదాత్త స్వరభంగిమలతోఁ దత్సంబంధములగు మంత్రములన్నియు, తండ్రి రవికి స్వయముగ నుపదేశించెను. ఉపనయన మంత్రములకు జీవమైన గాయత్రీ మంత్రమును మహర్షి యర్థస్వరయుక్తముగ నుపదేశించునపుడు రవియాత్మానందమునకు మేర లేదు. భూలోక, భువర్లోక, సువర్లోకములన నేమియో మొదట నాతని భావనాపథమున కందలేదు. కాని పునశ్చరణ సేయగా నాతని మన మాయా యవధుల నతిక్రమించి సువర్లోకపు సుకృతి సంపదలఁ బుణికి పుచ్చుకొన్నట్లాయెను. ఆహా! యేమి రవీంద్రుని యార్ద్ర హృదయానుభూతి! ఇట్టి యనుభూతిని మన మెందఱు పెద్దలలో గాంతుము? ఇఁక లౌకిక వ్యవహారములయందు చిత్తమును హత్తించి యాడంబరమునకు మాత్రము జపమాలలను ద్రిప్పువారు కొందఱు. అటు బాహ్యకర్మాచరణమే యనావశ్యకమని స్వకర్మానుష్ఠానమును వీడి సంచరించు నాత్మవంచకులు కొందఱు! అనుభూతితోఁ గూడిన కర్మానుష్ఠానమే జీవితా

నందము! అట్టి యానంద జీవితములే జాతికి గర్వహేతువులు. రవిబాబునకు బాల్యముననే యట్టి యనుభూతి సిద్ధించుట, పూవుపుట్టగనే పరిమళించుటకదా !

రవీంద్రుని యదృష్టరేఖలు, జననుని వాత్సల్య కాంతి పుంజములచే విస్ఫారితము లగుచుండెను. వచ్చినది పిలుపు! ఎచ్చటికి? భారతమాతృ ధవళ కిరీటమగు హిమాలయ పర్వత శ్రేణికి!! రవి యెడంద సంతసమున గంతులువేసి తండ్రి ననుసరించినది. సూర్యోదయ సూచకమగు నరుణోదయమువలె హిమాలయమునకుఁ బూర్వము ప్రశాంత మాధురీ వాతావరణమును వెల్లివిరియు శాంతినికేతనమున నతఁడడుగిడెను. 'ఇది యంతయు నీవిహార భూమి' యని మహర్షి పల్కినంతనే తరతరములనుండి తరలని దాస్య శృంఖలల నొక్కపెట్టున విచ్ఛేదమైన జాతివలె రవీంద్రుని హృదయ మానందమున నుప్పొంగెను. ఏండ్ల తరబడి పంజరబద్ధమైన శుకమును స్వేచ్ఛగా వదలిన నీలి వియత్పథమున నెటుల సంచరించుటకును తెన్నుగానక యటునిటు వెఱ్ఱిగ తిరుగాడునట్లు రవీంద్రుఁ డూరక కొంతకాల మానికేతమునఁ బరుగులిడెను.

పెద్ద ముత్తైదువుల వలెనున్న క్షేత్రలక్ష్ములు సర్వప్రపంచ సమ్మాన్యుఁడుకానున్న రవి బాలునకు రుచిరాగత మొసఁగినవి. పికాంగనలు మంజుల కుహూకుహూరావములతో భావిభావ కవి చక్రవర్తికి వీనుల విందొనర్చినవి. ప్రాక్ప్రతీచీగురుదేవుఁడు కాగల యాబాలకుని యరుణపాదములకు సెలయేటి కన్నులు

పాద్యము లందించినవి. సుగంధ సుమ రాజములతో పాదపములు పాదపూజ నొనర్చినవి. ప్రకృతిమాత యే తత్క్రియల నాని కేతన మాతని భావిజీవిత కార్యకలాపమునకు రంగభూమియని యా లేఁత డెందమున కిట్లెఱుకపఱచెనా యేమి?

రవీంద్రుఁడు శాంతినికేతన ప్రకృతి శోభను సర్వము హృద్గత మొనర్చుకొనెను. జనకుని ధ్యాన వేదికను నిత్యము నూతన కుసుమరాజములతో నలంకరించెడివాఁడు. మహర్షి తన కుమారునకు వలసిన స్వేచ్ఛనొసఁగి, మధుపము మాడ్కి యానంద మరందము నాస్వాదింప నవకాశములఁ గల్పించెను. ప్రపంచమున నింకను కొన్ని శాంతి నిలయములు కలవు. వాని సందర్శనమే మహాత్ముల కాత్మభోగము. అందుచే దేవేంద్రుడు రవీంద్రునితోఁ దన కార్యక్రమము ననుసరించి యమృతసరమున కరిగెను.

సిక్కు భక్తులు తమ పవిత్ర దేవాలయమునఁ బూజా మంత్రములఁ బఠించుచుండ, మతాంతరుఁడు నపరిచితుఁడును నగు నీ దేవేంద్రుఁడు వారితోఁబాటు మధురముగ మంత్ర పఠనము గావించుట యచటి యాబాల గోపాలమున కానం దాశ్చర్యములఁ గల్గించినది. ఎట్టి విశాలహృదయము దేవేంద్రు నిది!! రవీంద్రుఁడు తన పూజ్యజనకుఁడు ప్రదర్శించిన భారతీయ మతసామరస్యముతోడనే సంతృప్తుఁడుకాక ప్రాక్ప్రతీచీమానవ సమైక్యమునకుకూడ యత్నించుట యాదర్శ జనకున కాదర్శ తనయుఁడని నిరూపించుకొనుట కదా!

దేవేంద్ర రవీంద్రు లొకనెలబొ టమృతసరమున నానందముగ గడపిరి. ఆ దేవేంద్ర సన్నిధిని దేవతలవలె నీ దేవేంద్ర సన్నిధిని భక్తులు బారులుదీర్చి సిక్కుమత గేయములను శ్రవణ పేయముగ సంకీర్తనముఁజేసి యుర్వ సత్కారముల నందిరి. తండ్రి భక్తితత్పరత బిడ్డకుఁ బ్రత్యక్షమై యాతని హృదయ మును బ్రఫుల్ల మొనర్చినది.

ఇఁటనుండి వారి ప్రయాణము హిమాలయమునకు. విడిది డల్‌హౌసీ. పర్వతసానువులు ఫలవృక్షభరితములు; బాలుర స్వేచ్ఛావిహారమున కత్యంతానుకూలములు. రవీంద్రుఁ డీసదవకాశమును జారవిడువలేదు. పరాకాష్ఠనందిన యా ప్రకృతి సౌందర్యమును గుత్తుకబంటిగా నాస్వాదించెడివాఁడు. ప్రొద్దుపొడుపువేళలఁ దండ్రితో వాహ్యాళి నెడఁబసపుడు తన మధురానుభవముల నవ్యక్త మధుర వాగ్గుంభనమున నివేదించెడివాఁడు. తనయుల సంభాషణములు జనకులకు కర్ణయుగళ సద్భూషణములు కదా!!

భారతీయ ఋషిసత్తములకువలె సరళ జీవితమును, మహోన్నతభావము నలవఱచుకొనుటయే యీ ఋషిసత్తము నకు నాజీవిత లక్ష్యము. శిశిర ఋతువున గూడ నెముకలఁ గొఱకు చలిలో నాతఁడు శీతలోదకములనే స్నానమాడి రవిచేఁ గూడ నట్లే చేయించెడివాఁడు. ఈరీతి తండ్రిచే క్రమ శిక్షితుఁడు కాఁబట్టియే కాలాంతరమున నాతఁ డాంగ్లదేశము వెడలినప్పుడుకూడ శీతలజల స్నానమును విడువక తన

నియమ నిష్ఠాగరిష్ఠతను వ్యక్తీకరించెను. ఈనాఁటి విద్యార్థులు పిన్నవయసుననే సదభ్యాసముల నలవఱచుకొనమియేగదా! వారి జీవితములు చుక్కాని లేని పడవలవలె కాలవాహినిలో కష్టముల నెదుర్కొనలేక సుడిగుండములఁ జిక్కి సురిగిపోవుట!

హిమాలయము రవీంద్రునియెడ సమస్త ప్రకృతి సంపత్సదనమేకాక యాదర్శ విద్యాసదనముకూడ నగుట యాతని యదృష్టము. అచ్చోట సర్వవిజ్ఞాన ఖనియగు పితృదేవుడే రవికి గురుత్వము వహించి సంస్కృతాంగ్లములనేకాక వృక్ష ఖగోళ శాస్త్రములనుగూడ బోధించెను. హిమాలయ శిఖరసానువుల నాసీనుఁడై తాతపాదుల సన్నిధిని రవీంద్రుఁడు కవికుల గురువగు కాళిదాసకవీంద్రుని "మేఘ సందేశమ"ను నుత్తమకావ్యము నధ్యయన మొనర్చెను. ఆ కవిసార్వభౌముని మధుర మంజుల మందాక్రాంతవృత్త మీబాలకవిశేఖరుని హృదయాబ్ధి నానంద తరంగముల నావృత్త మొనర్చినది. ఆ లఘుకావ్యమున నాకవీశ్వరుని దివ్యలేఖిని తీర్చిదిద్దిన భారతీయగ్రామజీవిత దృశ్యములు రవీంద్రుని శుభ్రహృదయఫలకమున హత్తుకొని యాతని మహత్తర భావనాశక్తిని ప్రోదిచేసినవి. బాల్యమున కాళిదాసుని కమనీయకవితపై నేర్పడిన యభిమానము రవీంద్రునిలో కాలక్రమమున నతిశయించి, పరాకాష్ఠనంది, మహోన్నత విశ్వకవిస్థాన మధిష్ఠించిన యాతని హృదయమును సహిత మధిష్ఠించి, పునఃపునః పఠనమునకుఁ బ్రేరేచెడిది. మహాకవి మాహాత్మ్యమును మహాకవి తెలుసుకొనుటకే యింతటి తపస్సు

కావలసియున్న సామాన్యులమాట చెప్పనేల? నిక్కముగను రవీంద్రుని శాస్త్ర సారస్వతాభిలాష యీ పుణ్య పర్వత సానువులయందే స్థిరత్వము గాంచెను. నిశీథినీ సమయమున దేవేంద్రుఁడు రవీంద్రునకు రత్నఖచితమైన 'చాందినీ' వలె నొప్పు నక్షత్ర ఖచితాంబరమునందలి ప్రతి నక్షత్రమును బేరు పేరున నెఱుకపఱచెడివాఁడు. అప్పటినుండి రవికి ఖగోళశాస్త్ర జ్ఞానోత్సుకత్వము వృద్ధిపొందెను. ఆనాఁటి పరిచయము నభివృద్ధి చేసికొని రవీంద్రుఁడు వియత్పథ సౌభాగ్యమును విశదపఱచునట్టి క వినూత్న గ్రంథమును, నీరసమగు శాస్త్రవిషయికమైనను, కవితా కళామేళనమున రసోదంచితము గావించి, జగతి కందించెను.

వృక్షశాస్త్రమునఁగూడ నతని యుత్సుకత క్రమముగ నభివృద్ధినై పారము ముట్టినది. ఆతఁ డప్పటినుండియు రమణీయ తరులతాపుష్పములను రమ్యకవితా హృదయముతోనే కాక నిశిత శాస్త్రీయదృష్టితోఁగూడ పరిశీలించి తత్త్వమును హృద్గత మొనర్చుకొనెను.

హిమాలయమున నాలుఁగు నెలలు గడచినవి. రవీంద్రుని దివ్యజీవిత సౌధమునకు పునాదు లేర్పడిన కాలమిది. దేవేంద్రుని దేవతాహృదయము నవగతమొనర్చుకొని యట్టి కమనీయ మహనీయ గుణగరిష్ఠునకుఁ బుత్రుఁడగుట తన పూర్వ జన్మకృత సుకృత విశేషమనియే భావించెను. దేవేంద్రుఁడు తన సంతతి స్వతంత్రాలోచనతో వర్ధిల్లవలయునని వాంఛించి

యందులకుఁ దగు దోహదములు గల్గించెను. బోధనాసమయమున రవీంద్రుని స్వేచ్ఛగా తనకుఁగల సంకోచములఁ బ్రశ్నింపుమని కోరుటయేకాక ప్రోత్సాహము కూడ చేసెడివాఁడు. రసప్లుత హృదయము, బుద్ధినైశిత్యము జతపఱచి తన తనయుఁడు పృచ్ఛించు ప్రశ్న పరంపరల కాతఁడు సద్భావముతో ప్రశాంతముగ సమాధానము లిచ్చెడివాఁడు. దేవేంద్రుని నిత్య సత్యనిరతి, యుదాత్తచరిత్రము, రవీంద్రునకు నిత్యోపాసకములైనవి.

ఈనాఁడు తండ్రులు బిడ్డలఁగనుటయేకాని వారిని పెంచు తెరువులను తెలియక గ్రుడ్డివాఁడు గ్రుడ్డివానికి దారి చూపు రీతిని ప్రవర్తించుటచేతనే దేశ మిట్టిదౌర్భాగ్యస్థితి పాలైనది. తండ్రులందరు దేవేంద్రులై, బిడ్డలందరు రవీంద్రులైన నాఁడు గదా ! భారతదేశము భాగ్యవంతమగుట !!

## ౭

హిమాలయమునుండి రవీంద్రుఁడు స్వగ్రామముచేరెను. ఆ రాకచే నతనికి దివినుండి భువికిఁ దిగినట్లాయెను. ఈ పర్యాయమాతఁడు సెంటు క్రీవియన్ కళాశాల నధ్యయన మారంభించెను. ఈ కళాశాల వాతావరణ మతనికి కొంతవఱకు నచ్చినది. ఇందలి యధ్యాపకులు రవీంద్రుని ప్రతిభావిశేషములను గుర్తించిరి. పదుగురితోఁ గలిపిచెప్పు చదువువలన నాతని కెట్టి

వృద్ధియు నుండదని గ్రహించి రొయొక యధ్యాపకుఁ డీతనిచే షేక్స్పియర్ రూపకములఁ గొన్నింటిని వంగభాష కనువదింప జేసెను.

రవీంద్రుని ముఖారవిందము దివ్యతేజఃపుంజముల నెలు గొందుచుండెను. అతఁడు బాహ్యముగా నెట్టి పనులయందు నిమగ్నుఁడైనను, నంతరము ప్రార్థనాయుక్తమై యుండెడిది. సమస్తవిశ్వము నాతనికి ప్రేమమయముగ గోచరించినది. నిజ మున కాతని కీ కళాశాలలలోఁ బని లేదు. అంగ్లాశయములలోఁ బనిచేయు నిట్టి కళాశాలలు తేజోవంతుల కేమి బోధింపఁగలవు? ఈ ప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగ రవీంద్రుఁ డీ కళాశాలనుండి నిర మించి యాత్మీయ విశాల కళాక్షేత్రమున స్వకీయ ప్రతిభా సంపత్తుల విస్తృత మొనర్పసాగెను. వివిధ కళోపాసకులగు సోదరులందఱిలో నాతనికికూడ స్థానము లభించినది. వారంద ఱతని నపారముగఁ బ్రేమించుచుండిరి. ఇంక నాతని కెట్టి కొఱఁ తయు లేదు. వివిధ కళాభ్యున్నతికిఁ దగిన ప్రోత్సాహము లంభించెను.

పెద్దన్న ద్విజేంద్రుఁడు మహామేధావి. గొప్ప వేదాంతి. హృదయము స్పందించినపుడే కావ్యసృష్టి. ఒక సోదరుఁడు జ్యోతీంద్రుడు. సంఘసంస్కరణాభిలాషి, సరస సంగీతకళా నిష్ణాతుఁడు. వీరల ప్రభావము రవీంద్రునిపై నపారముగ ప్రస రించినది.

ఈ సందర్భమున రవీంద్రుడు చేసిన కొంటెపని యొకటి విస్మరింపరానిది. వంగవాఙ్మయమున సుప్రసిద్ధ వైష్ణవ సంప్రదాయమునకుఁ జెందిన పూర్వకవీశ్వరుఁడగు భీమసింహుని పేర తాను కొన్ని పద్యములు వ్రాసి ప్రచురించెను. వాని నొక సారస్వత పరిశోధకుఁడు తన పరిశోధనా వ్యాసమున నలంకరింపఁజేసి బిరుదముకూడ నందుకొనెను. తరువాత నీ పద్యములు రవీంద్రునివని తెలిసియందఱు సంభ్రమలోలురైరి. చూచితిరా! రవీంద్రుఁ డెంతటి మోసగాఁడో!! నేఁటి విద్యార్థులును నీరీతి మోసములు చేయఁగల శక్తిమంతులైన నెంతటి భాగ్యము!! ఈ యీడుననే రవీంద్రునకు సుప్రసిద్ధ నవలాకారుఁడగు బంకించంద్రుని పరిచయభాగ్యము లభించినది. దినదిన మాతని మిత్రసంపద యభివృద్ధియగుచుండెను.

సోదరుఁడు జ్యోతీంద్రుఁడు సంస్థాపించిన 'భారతి'పత్రికా సంపాదకవర్గమున నీతనికిని సభ్యత్వము ప్రాప్తించినది. అందతఁడు తన పద్యగద్య పరిశోధనాత్మక వ్యాసములఁ బ్రచురించి సారస్వతేయుల ప్రశంసల నందుచుండెను. సోదరుఁడు వ్రాసిన నాటికలలో తాను ప్రధానపాత్ర వహించి నిర్వహించెను. పదిపదాఱేండ్లకే రవీంద్రుఁడు వివిధ లలిత కళోపాసనాచణుఁడై తన ప్రతిభను సుప్రథిత మొనర్చుకొనెను.

## ౮

వంగ సంస్కృతాంగ్ల సాహిత్యములయందు చక్కని పరిజ్ఞానము సంపాదించుకొనుచు రవీంద్రారవిందము వికసించి తన సౌరభమును వ్యాపింపఁజేయుచుండెను. కొంతకాల మతఁడు చారిత్రకముగఁ బ్రసిద్ధిగాంచిన 'అహమ్మద్' నగరమున న్యాయవాదియగు సోదరునితో గడపి యాతనితో నాంగ్ల దేశమునకుఁ బయనించెను.

తన యాంగ్లదేశ ప్రయాణానుభవములనన్నిటి నతఁడు లేఖలమూలమున వంగ 'భారతి'పత్రికలోఁ బ్రకటించెను. ఆంగ్లదేశమునఁ దొలుత నొక విద్యాలయమునఁ బ్రవేశించెను. విదేశీయుఁడగు తనయెడ నా దేశీయ సహాధ్యాయులు చూపిన సౌజన్యమునకు రవీంద్రుఁ డానందించెను. అట్టి నడత తన దేశీయులలో మృగ్యమైనందుకు సిగ్గుపడి నిట్టూర్చెను. సాయం సమయముల మిక్కుటముగ చలి వేధించుచున్నను, సరకు గొనక ధవళ చంద్రికలలో ధగద్ధగాయమానముగ వెలుగొందు హిమావృతప్రాంతముల నవలోకించుచు ప్రకృతి సౌందర్య శోభచే ఆనందరస నిమగ్నుఁడయ్యెడివాఁడు.

'లాటిన్' భాష నభ్యసింప మొదలిడెను. కాని సరియైన యుపాధ్యాయుఁడు లభింపమి సాగలేదు. ఆంగ్లేయ సాంఘి కాచార సంప్రదాయములను బూర్తిగా నవగాహనఁ జేసికొన వలయునన్న తానున్న సోదర గృహవాతావరణము మాత్రము

చాలదని కొంతకాల మతఁడు 'స్కాటు'ను నొక మిత్రునింట నతథిగా నుండెను.

'స్కాటు' దంపతు లాదర్శదంపతులు. స్కాటుభార్య భర్తమనసులో వర్తించు సాధ్వీమణి. గృహనిర్వహణమునందే కాక భర్త కార్యభారమును యథాశక్తిని వహించు నేర్పరి. ఇట్టి ధర్మపత్ను లాదేశమునందును నుండుట రవీంద్రునకు సంతసము కల్గించినది. భర్తయెడ భార్యప్రేమ గౌరవముతో నారంభమై యారాధనముగ పరివర్తింపవలయునని యాతఁ డొక సుస్పష్టమగు నాదర్శము కుదుర్చుకొనెను. ఇట్టి పరివర్తనము శారీరకసుఖాపేక్షవలనఁగాక యేకైక మహోన్నత లక్ష్యసాధనమునందు కుదురునను విశ్వాస మా దివ్యదంపతులవలన నీతని కేర్పడినది. ఆదర్శ ధర్మపత్నియగు 'స్కాటు' వనిత యా జీవిత మాతని మనోవీధిని గోచరించెడిది.

'లండను' నగరమున రవీంద్రుఁడు బహుముఖ కార్యకలాపములయందు నిమగ్నుఁడాయెను. విశ్వకళాపరిషత్తున సారస్వతోపన్యాసములను శ్రద్ధతో నాలించెడివాఁడు. కళాపరిషత్తు గ్రంథాలయమునకు నియమము తప్పక వెళ్ళి వివిధ గ్రంథావలోకనము గావించెడివాఁడు. సారస్వత చర్చలలోఁ బాల్గొనెడివాఁడు. ఆంగ్లకవనము తజ్జాతికి సహజలక్షణమగు నుద్వేగము ప్రధానమైనదనియు, భారతీయ కవనము తజ్జాతికి సహజలక్షణమగు సంయమము ప్రధానమైనదనియు రవీంద్రుఁ డానాఁడే గుర్తించి, జాతీయతను విడనాడక చిత్తసంయమముతోఁ గవిత్వ

మును జెప్పనెంచెను. ఈ సమయమునసనే యాతఁడు ప్రాక్ప్రతీచీ సంగీత కళారహస్యములనుగూడ గుర్తించెను. విదేశీయులకు స్వరమాధుర్యము ప్రధానము. మనకు మాధుర్యముతోఁ బాటు స్వరవిన్యాసముకూడ ముఖ్యము. వారి జీవితమునందు వలె వారి కళయందును వైవిధ్యమెక్కువ. మనకు వైవిధ్యమున నైక్యము సాధించుట లక్ష్యము. వారికళ భౌతికవాసనల నతిక్రమింపదు. మనకళ క్రమసోపానముల భౌతికము నతిగమించి యనిర్వచనీయమైన యానందబ్రహ్మైక్యము నందుకొనఁ జూచును. ఇట్టి సంగీత కళారహస్యముల గమనించిన రవీంద్రుఁడు వానినన్నింటిని తన సంగీతరూపకముల నాయకపాత్రల గుణగణముల కనుగుణముగ నుపయోగించెను.

ఆంగ్లదేశమున రవీంద్రుఁ డొకటిన్నర సంవత్సరము గడిపెను. ఆదేశమం దాతని కెందరో గాఢమిత్రులు కలరు. ఆంగ్లేయుల స్నేహసౌజన్యము లాతని మెప్పుబడసినవి. వారిలో నొక్కఁడుగ నతఁడు కలసిమెలసి జీవించి, వారి జీవితవిశేషములను సమగ్రముగ నెఱిఁగెను. ఆంగ్లసారస్వతము నంతయు నాపోశనము పట్టెను. ఫ్రెంచి, జర్మను సారస్వతములఁ బరిచయము నేర్పఱచుకొనెను. కడకెట్టి పట్టమునుగాని బిరుదమును గాని యాతఁ డందుకట్టించుకొనకయే సోదరునితో మాతృదేశమునకు మఱలెను. పాశ్చాత్యదేశములకేగి యెట్టి బిరుదములనుగాని, పట్టములనుగాని యాశింపక వచ్చినవారిలో రవీంద్రుఁడే ప్రథముఁడేమో !! ఉదరపోషణమునకో, ఆడంబరము

నకో యుపయోగపడు నిట్టి పత్రములతో నిత్యకళోపాసనా వ్రతాచారసంపన్నుల కేమి యవసరము? పాశ్చాత్య బిరుదములకేకాదు, పాశ్చాత్య వస్త్రధారణము, పాశ్చాత్య ప్రవర్తనమందలి వివిధ వ్యామోహములకు యువకుఁడగు రవీంద్రుఁడతీతుఁడై స్వజాతి సంప్రదాయరక్షణమునుండి వైదొలఁగక తన తరువాతివారి కాదర్శప్రాయముగ నిల్చెను.

కుటుంబకౌతుక మాతఁడు న్యాయవాది కావలయునని. భగవదభీష్టమాతఁడు విశ్వకవియై ప్రపంచమునకు మకుటములేని చక్రవర్తి కావలయునని. మాతృదేశమునకు వచ్చిన కొలఁదిమాసములకే యాతనిని తండ్రి మరల యాంగ్లదేశమునకుఁ బంపవలయునని యత్నించెను కాని నెరవేర లేదు. అది భగవదిచ్ఛ. ఎవరిచే నేమి యెప్పుడు చేయింపవలయునో సర్వజ్ఞుఁడగు భగవానునకేగాని యల్పజ్ఞులగు మానవుల కేమి యెఱుక?

రవీంద్రుఁ డప్పటి కిరువది వర్షముల యువకుఁడు. తూర్పుబెంగాలునఁగల తన యాస్తిపాస్తుల నిర్వహణమంతయు దేవేంద్రుఁడు రవీంద్రున కప్పగించెను. ఆ ప్రాంతములకుఁ బోక పూర్వము రవీంద్రుఁడు కలకత్తాయందుండి సారస్వత సేవ గావించెను. పవిత్ర హిమోత్తుంగ శృంగములనుండి ప్రవహించు దివిజాపగ భరతావనిని సస్యసమృద్ధ మొనర్చునట్లు, రవీంద్ర హృదయ వినిర్గత కవితాస్రవంతి మానవహృదయ కేదారముల భావ సస్యములఁ బండించినది.

ఆంగ్లావనినుండి వచ్చినపిదప రవీంద్రుని సంగీతమునందు పాశ్చాత్యవాసనలు పొడగట్టినవి. అతని కంఠస్వరము వినూత్నముగ ధ్వనించుట గమనించి యందఱు నాశ్చర్యపడిరి. ఇట్టి ప్రాక్ప్రతీచీ సంప్రదాయ సమ్మిశ్రిత సంగీత పరిజ్ఞానముతో రవీంద్రుడొక వినూత్న సంగీతనాటికను రచించెను. అదియే వాల్మీకి ప్రతిభ.

క్రౌంచమిథునమునకు సంభవించిన దారుణమునకు వాల్మీకి హృదయము కరుణారసతరంగితమైనది. అప్పు డాతని శోకము తంత్రీలయసమన్వితమైన శ్లోకముగా మారినది. ఇదియే యిందలి యితివృత్తము.

ఈ సంగీత నాటికయందు రవీంద్రుడు చాలవఱకు భారతీయ రాగపద్ధతులనే యవలంబించెను. కాని వానికి శాస్త్రప్రాధాన్యము తగ్గించి శ్రవణపేయముగావించెను. అందుచే నవి పండితులకన్న పామరుల కెక్కువాహ్లాదము కలిగించినవి. కిరాతులమూక త్రాగి తందనాలాడునపు డాంగ్లరాగపద్ధతుల నేర్పఱచెను. అరణ్యపక్షుల రోదనము నైరిష్‌రాగ పద్ధతుల వ్యక్తీకరించెను.

ఇట్టి యీ యపూర్వసంగీతరూపకము ప్రదర్శింపఁబడగా చూచి యానందింపఁదగునేకాని చదివినంతమాత్రమున తృప్తికలుగదు. ఈ రూపకము ప్రథమమున రవీంద్రుని గృహముననే ప్రదర్శింపఁబడినది. రవీంద్రుడు 'వాల్మీకి' పాత్రను, నాతని మేనకోడలు ప్రతిభ 'సరస్వతి' పాత్రను నభినయించిరి.

పండితమిత్రు లీయపూర్వప్రదర్శనమునకుఁ బులకితగాత్రులై రవీంద్రునిపై నాశీఃపూర్వక ప్రశంసాప్రసూనముల వర్షించిరి. తా నిట్టిరచనయం దార్జించిన విజయమున కుత్సాహియై రవీంద్రుఁ డారీతినే "మృగయా వినోదము" ను మఱియొక నాటికను గూర్చెను. ఇందలి యితివృత్తము. దశరథుఁడు తన మృగయా వినోదమున మత్తేభమని భ్రమపడి శ్రవణుఁడను ఋషికుమారుని తన నిశితనారాచమునకు గురిచేయుట. ఇట్లే "మాయా ఖేలనము" ను మఱియొక నాటికనుగూడ రచించి తద్రచనా విధానమునఁ బరిణతిని పడసెను. ఈ రచన లన్నింటియందును జ్యోతీంద్రుని సంగీత ప్రభావ మెంతో ప్రసరించెను.

ఈ వయసుననే రవీంద్రుఁ డనేకగీతికల నల్లెను. అవి యన్నియు "ఉదయగీతికలు" "సాంధ్యగీతికల"ను శీర్షికలక్రింద ప్రత్యేక సంపుటములుగా ప్రచురింపఁబడినవి. వీని ఛంద స్సతి స్వతంత్రమైనది. అతని భావమునకు ఛందస్సు లొంగినదికాని ఛందస్సునకు భావము లొంగలేదు. ఎట్టి ప్రతిబంధకములులేని స్వేచ్ఛాహృదయముతో నాతఁడు తన రచనలఁ గావించెను. స్వేచ్ఛ, బంధనవిచ్ఛేద మొనర్చును. తొలుత నది స్వైర విహారమునకు దారితీసినను, అనంతర మతి సహజ విధానమున వలసిననిబంధనముల నొనఁగూర్చుకొనును. సహజకవి ఛందమునకు భీతిలఁడు. ఛంద మాతని పరిచారిక. అలౌకికానుభూతులతోఁగూడిన రవీంద్రుని కవితాజీవితమున నీ ప్రాయ

మెంతటి ప్రముఖమైనదో, ఆ కవి హృదయమున కానాఁడెట్టి జాగృతి కల్గినదో యాతని స్వకీయ వాక్యములనే గమనింతము:

"ఈ సమయము నా కవితాజీవితమున నిత్యసంస్మరణీయ మైనది. నా గీతికలందంతగా కవితాగుణము లేకపోవచ్చును. కాని నా యాత్మసంతృప్తి కొక్కటే కారణము. ఛందస్సు విషయమై యెట్టి ప్రత్యేకశ్రద్ధయు వహింపక యతి సహాజ ధోరణిలో స్వేచ్ఛాపూర్వకముగ గీతికల నల్లితిని. తల్లిదండ్రు లకు ప్రథమసంతానమువలె నా కీకృతు లనారతమానంద దాయకములు.

"ఈ కాలముననే వివిధ "ప్రబంధావలోకనము"ను శీర్షికను ననేక గద్యపద్యఖండములు రచించితిని. ఈ తఱినే నవలారచనకుకూడ గడంగితిని. ఈ తీరున వివిధరచనా వ్యాసంగముల నానందముగఁ బ్రొద్దుఁబుచ్చుచున్న పు డొకనాఁటి సాయం సంధ్యాసమయమున నొక క్షణిక మానసిక విప్లవము హఠాత్తుగా నాయందుద్భూతమైనది. ప్రభాసంపన్నమైన సాంధ్య రాగములు నాహృదయమును రసప్లావిత మొనర్చినవి. పరిసరము లన్నియు ననురాగరంజితములయినవి. ఈ యద్భుత దృశ్యము నకు విస్మయచకితుఁడనై తిని. కొంతతడవునకు నా యంత రంగమందేమియో పరివర్తనము కల్గినట్లు తోఁచినది. అప్పటి నుండియు నాకు ప్రపంచమంతయు సౌందర్య సంశోభితమైనట్లు కన్పించినది. నాటకరంగమందలి ప్రేక్షకునివలె నే నీ జగన్నాట

కమును సందర్శింప మొదలిడితిని. క్రమక్రమముగ నా యంత దృష్టి విస్తృతమై ఆజీవితమునకు జీవనాధారమైనది.

"మఱియొక యుషఃకాలమున నిట్టి యనుభూతియే కల్గినది. నేను 'పంచపాళి'లో నిలువఁబడి ప్రాక్ దిశాకాశమును దిలకించుచుంటిని. బాలభానుఁడు వృక్షాగ్రముల నతిక్రమించుచుండెను. నేనట్లే తదేకదృష్టి నవలోకించుచుంటిని. అంతలో నొక కాంతికిరణము నాకనుల మిఱుమిట్లుగొల్పినది. ప్రపంచమంతయు నాకు జ్యోతిర్మయముగ గోచరించినది. అంతట 'జలపాతమ'ను నొక గీతికాధార నాలో పెల్లుబికినది. నాఁకానాఁటినుండి పిపీలికాది బ్రహ్మపర్యంతమగుసృష్టి బ్రహ్మానందప్రదాయినిగా పర్యవసించినది. అనంత కాలసముద్రమున ప్రతిజీవియు నొక యానందతరంగమైనది. బాల్యమునుండియు నేను కన్నులతో మాత్రము కాంచుచుంటిని. ఈనాఁటినుండి సంపూర్ణహృదయముతో జగద్గతుల సందర్శింపనారభించితిని. చెలికాఁడు చెలికాని పలుకరించి పకపకనవ్వుట; తల్లి బిడ్డను బదేపది ముద్దిడుకొనుట; పలుకరింపుగా నావు లొండుకులను గొమ్ములతో గీరుకొనుట; నా కాత్మోత్తేజనము కల్గించు దివ్యదృశ్యములయినవి.

'తటాలున నా హృదయకవాటములు తెఱచుకొన్నవి
సర్వజగజ్జీవన సంఘములును నందు
ప్రవేశించి యానందావలోకన మొనర్చుకొనుగాక !'

యని పట్టరాని యానందమున రచించుకొంటిని. ఇది కవితా

సంబంధమగు నతిశయోక్తికాదు. ఆనాఁటి నాయనుభూతి నంతయు ప్రకటించుటకు నాకు శక్తి చాలదన్న విశ్వసింపుడు. ఇట్టి దివ్యానుభవశబలత క్రమక్రమముగ సన్నగిలినను దాని మాహాత్మ్యము నన్ను వెన్నంటియే యుండెను."

ఏండ్లు పైఁబడుకొలఁది రవీంద్రుఁడు పెద్దల చెలిమిని బడసెను. బంకించంద్ర, ఈశ్వరచంద్ర విద్యాసాగరుల వాత్స ల్యము నందుకొనెను. రాజేంద్రలాల్ మిత్రా యను పండిత మిత్రుని మైత్రితో భాషావిషయక విజ్ఞానమును కరతలామల కము గావించుకొనెను. విశ్రాంతి సమయముల బొంబాయి ప్రాంతమున ప్రకృతిమాతకు పుట్టినిల్లగు మలయ పర్వతమున కేగెడివాఁడు. అందొకచో ప్రకృతిశోభాకృష్టుఁడై "ప్రకృతి ప్రతీకార" మను నద్భుత గేయనాటికను రచించెను.

సర్వసంగ పరిత్యాగియైన యొక సన్యాసి యొక యనాథ బాలికోద్ధరణమున కనురక్తుఁడై ప్రకృతిశక్తులకు లొంగిపోవుట యిందలి కథానకము. "ఈ గేయనాటిక నా భావి సాహిత్య సృష్టికి నుపోద్ఘాతమువంటిది. నా సమస్త రచనల యందంతర్గత మగు రహస్య మిందిమిడి యున్నది. అనంత విశ్వశక్తిని పరి మితములగు నుపాధులలో దర్శించి యానందించుటయే యిందలి రహస్యము"ని రవీంద్రుడే యుద్ఘాటించెను.

కవితా కన్యతోపాటు 'మృణాళినీకాంత' స్థితప్రజ్ఞుఁడగు రవీంద్రుని వరించినది. ఇంతలోఁ దన్ను కన్నబిడ్డవలె పెంచి పెద్దఁజేసిన వదినెగారు పరమపదించినది. చావన్న నేమియో

తెలియని రవీంద్రున కీ దుఃఖము దుర్భరమైనది. అయినను నర్ధాంగి సాహచర్యమున నీ శోకము క్రమక్రమముగ నుపశమించినది.

ఒకవంక "వంగదర్శనము", "నవజీవనము", "బాలక్" మున్నగు పత్రికలను వివిధ పద్య గద్య గేయ వ్యాససుమములచే నలంకరించుచు, వేఱొక వంక తన సహజ హృదయసౌజన్యముతో నర్ధాంగి నలరించుచు రవీంద్రుఁడు సముచితానందమునఁ గాలము గడుపుచుండెను.

౯

వివాహానంతరము పదునైదు సంవత్సరములు రవీంద్రుఁడు వంగదేశమునందే యుండి దేశసేవ, భాషాసేవ, మతసేవలు గావించెను. ఈ కాలముననే యాతని కిరువురు కుమారులు, ముగ్గురు కొమరితలుకూడఁ గల్గిరి. కుటుంబ జీవనానుభవమునఁ బరిపూర్ణుఁడై యతఁ డవాప్తకాముఁడాయెను. అట్లని సారస్వతవ్యవసాయము మందగించలేదు. గద్యపద్య కావ్యము లనేకముల రచించి ప్రచురించెను. జగద్విఖ్యాత సారస్వత పత్రికలఁ దన యమూల్యరచనలతో నవదరించెను. బహువిధ ప్రజాహిత కార్యకలాపములఁ గృషిసల్పెను. అతని కీర్తివల్లరి యన్నిదిశల కల్లుకొనఁజొచ్చెను.

ఆనాఁడు బ్రహ్మసమాజము రెండుశాఖలుగ చీలెను. అందొకటి యాదిబ్రహ్మసమాజము. ఠాగూరు కుటుంబ

మీఁ శాఖకుఁ జెందినది. వివాహానంతరము రవీంద్రుఁ డీశాఖకు కార్యదర్శియై యనేకవర్షములు సేవచేసెను. ప్రార్థనా సమావేశముల కుపయుక్తమగు పెక్కుగీతముల రచించెను. వానిని తన ముక్తకంఠమున నాలాపించి ముముక్షువులకు ముక్తిపథము నందించెడివాఁడు. మత సమావేశములలో మధుర మంజులముగ నుపన్యసించెడివాఁడు. దివ్యరోచనాశీలుఁడగు నా కవీంద్రుని రసమయ హృదయకుహర బహిర్గతమగు ప్రతి సినాదము సహృదయ హృదయాంతరాళముల ప్రతిధ్వనించెడిది. రవీంద్రుఁ డేండ్లు గడచినపిమ్మట నీ సమాజమునఁ గూడ సభ్యత్వము వదలుకొని పక్వఫలమువలె ముక్తజీవనము గడపెను. సర్వ మానవసంస్థకు సభ్యులైన దివ్యమానవులు సంకుచిత సంస్థలకు బద్ధులుకాలేరు కదా!!

విదేశ సంప్రదాయముల నంధప్రాయముగ ననుగమించు బ్రహ్మసమాజమును రవీంద్రుఁడు నిరసించెను. అట్లని హైందవ మత దురభిమానము నాతఁడు సహించెడివాఁడు కాఁడు. క్రైస్తవ మతప్రచారకుఁడగు సాధువొకఁడు కలకత్తా నగర వీధుల స్వీయమత ప్రచారము గావించుచుండెను. ఇది సహింపలేక కొందఱు హిందూయువకు లతనిపైఁబడి చావమోదిరి. అంతలో పోలీసులు రాగా పలాయనమంత్రము పఠించిరి. రవీంద్రుని కుసుమకోమల హృదయ మీదారుణ సంఘటనమునకు కుతకుత యుడికినది. వెంటనే తన నిశితలేఖనినిబట్టి "ధర్మ ప్రచారము"ను పేర వ్యంగ్యరచనఁజేసి ప్రచురించెను. తనకు

పితృతుల్యుఁడగు బంకించంద్రునితో నీ సందర్భమున నభిప్రాయ భేద మేర్పడినందులకు మిక్కిలివగచెను. కాని కడకు రవీంద్రుని ధర్మాసక్త హృదయము నెఱిఁగి బంకించంద్రుఁడే యాతనిని వాత్సల్యమునఁ జేరఁబిల్చెను. మహాపురుషులు వ్యక్తిగత వైమనస్యముల నతిక్రమించినవారు కదా!

ఈ ప్రాయమున రవీంద్రుని రచనలు దేశభక్తి ప్రపూరితములు. వంగదేశ వాతావరణమందు మూర్తీభవించెను. సస్యశ్యామలములగు నాక్షేత్రములు, నిర్మలాంబుపూరములగు నదులు, శోభాయమానములగు పల్లెసీమలు రవీంద్ర హృదయమును గదిపెడివి. పామరజనముకూడ హాయిగా పాడియానందించుకొనునట్లు, రవీంద్రుఁడు కూర్చిన "బంగారు బంగాళమ"ను జాతీయగీతము వంగీయులపాలిటి పెన్నిధానము. దేశవైభవమును గీర్తించుటతో తన కర్తవ్యము ముగిసినదని తలపోయు కవివర్యుఁడు కాఁడు రవీంద్రుఁడు. దేశమును ప్రేమించుటనఁగా దేశసేవ చేయుటయేయని యాతని నిశ్చయము. ఈపదునైదు వత్సరములలో రవీంద్రుని దేశసేవ గ్రామోద్ధరణ సంబంధమైనది.

విద్యావేత్తలుగ పరిగణింపఁబడు వంగీయులు, ఆంగ్ల మానసపుత్రులై బహిరంగసభలయందేకాక, నిత్యనైమిత్తిక జీవితములయందును నాంగ్లమునే వ్యవహరించుచుండిరి. విద్యాలయములలో నన్ని విషయము లాంగ్లముననే బోధింపఁబడుచుండెను. ఈ దుస్థితికి రవీంద్రుఁడు దురపిల్లెను. మాతృభాష

యందే సర్వవిషయములు బోధింపవలయునని వ్యాసములను వ్రాసెను; ఉపన్యాసము లిచ్చెను. విజ్ఞుఁడగు తన సోదరుఁడు చిన్నతనమున తనకు మాతృభాషలో విద్యగఱపి, తన మానస వికాసమునకుఁ దోడ్పడిన విధమునందు విశదపఱచెను. బాలురకై తాను భావభరితముగ వ్రాసిన నాతికఠినములగు గేయములను ప్రచురించెను.

ఆకాలమున వార్షికముగ వంగరాష్ట్ర సమావేశములు జరిగెడివి. అందాంగ్లముతప్ప మాతృభాషా పదముకూడ వినవచ్చెడిదికాదు. రవీంద్రుఁడు రెండేండ్లు తీవ్రకృషి సలిపి, ఆంగ్ల పదమును వినరానీకుండఁ జేసెను. కాలక్రమమున వంగీయులకు వంగభాషాభిమానము గాఢతరముగ నేర్పడినది. విద్యాలయములయందు దానికి సముచితస్థాన మీయఁబడినది. ఇట్టి యాదర్శమే యితర రాష్ట్రములయందును వ్యాపించెను. భారతీయులు మాతృభాషారాధకులై భావదాస్యమునుండి విముక్తులగుటకు కవి యవిరామముగ యత్నించెను.

మహాకవులు నిరంకుశులు. వారిమాటలు మంత్రములు. వారికి వ్యాకరణాది నియమములు లొంగి 'సలాములు' చేయునే గాని, వారు వానికి కేలుమోడ్పరు. రవీంద్రుఁ డాకోవకుఁ జేరిన మహాకవి. అందుచే నాతఁడు స్వేచ్ఛనొంది గీతాలాపనము గావించెడివాఁడు. అం దటనట లక్షణవిరుద్ధములగు ప్రయోగము లుండవచ్చును. రంధ్రాన్వేషకులగు పండితులకు కొందఱకి కివి కన్నెఱ్ఱ గల్గించినవి. రవీంద్రునిపై నీర్ష్యబూని

వారీతని రచనలను నిషేధించుటకు తీవ్రముగ కృషిసల్పిరి. పరీక్ష పత్రములయందు "ఈక్రిందివానిలో దోసఁగుల దిద్దుఁడ"ని కొన్ని రవీంద్రప్రయోగములఁ బేర్కొనిరి. వీరి యాందోళనమునకు రవీంద్రమేరువు చలింపలేదు. జీవకళతో నొప్పారు నీతని గేయములు ప్రజాహృదయపీఠము నధిష్ఠించినవి. ఆనంద పారవశ్యమున వా రామహాకవి గేయములఁ బాడుకొనుచుండిరి. అర్భకులు గావించెడి యవరోధములకు మహాప్రవాహము లాగిపోవుకదా! ప్రతిభోజ్జ్వలవిలసితమగు రవీంద్రుని భాషకు విపశ్చిద్వర్యులైదుపదిచేసి మోకరిలిరి. వంగభాషలోని **కృతకత్వము నశించినది. జీవద్భాష తలయెత్తి కళకళలాడినది.** ఇంతటి సంస్కారము నప్రయత్నముగఁ దెచ్చిన రవీంద్రుని భాషాసేవ యపారమైనది! అట్టి సంస్కారము లట్టి మహాకవులుదక్క సామాన్యు లెంతప్రయత్నించినను సాధ్యపడునవి కావు. అట్టివారి ప్రయత్నములు భాష కనర్థదాయకములు కూడ నగును. వెనుకటికి పులులనుజూచి వాతలు పెట్టుకొనిన నక్కలవలె వారు పరిహాసపాత్రులుకూడ నగుదురు.

భారతదేశమునకు గ్రామములు జీవగఱ్ఱ. గ్రామ సౌభాగ్యమే జాతి సౌభాగ్యమని గుర్తించిన భారతీయులలో రవీంద్రుఁడు ప్రధానుఁడు. గ్రామస్థులతోఁ బరిచయము గావించుకొని వారి జీవనవిధానములఁ జక్కని చిక్కని సంస్కారములను దీసుకురావలయునని యాతని యాకాంక్ష. అవకాశము లభించినది. ఒరిస్సాదేశమున పద్మానదీతీరమున రవీంద్రునకు

భూములు కలవు. తండ్రి వృద్ధుఁడౌటచే వానిపై పెత్తనము రవీంద్రునిపైఁబడినది. పద్మానదిని నావపై పయనించుచు నిష్కళంకహృదయులగు రైతుపిల్లల నందఱను పేరుపేరునఁ బిల్చి పరిచయము గావించుకొనెను. పరస్పర సహకారము చేతను, స్వయంకృషితోడను వారు తమ గత సౌభాగ్యజీవనమును సాధింపవచ్చునని యుద్బోధించెను. విశ్రాంతి సమయములఁ దమ బాటలను తామే యేర్పఱచుకొనఁదగునని, చెఱువులు బాగుచేసికొనవచ్చునని హితముపదేశించెను. రాత్రివేళల వారి నొక్కచో చేర్చి విద్యాబోధ గావించెను. కవీంద్రుని వాక్కును వారు తొలుత పెడచెవినిబెట్టిరి. కాని యచిరకాలముననే వారు వివేకముతో నాత్మోన్నతికి సన్నద్ధులైరి. కవి వాక్యము రిత్తవోదు కదా! ఈనాఁడు జాతీయ ప్రభుత్వము తలపెట్టిన "సాముదాయక కార్యనిర్వహణముల"ను (Community projects) క్రాంతదర్శియగు కవీంద్రుఁడేనాఁడో ప్రజల కుద్బోధించెను.

రవీంద్రుఁడు తన గ్రామ సంచారానుభవములన్నింటిని లేఖల మూలమునను, కథల మూలమునను బ్రచురించి భారత జాతీయ జీవనమునకు శాశ్వతత్వము గల్పించెను.

"శాంతినికేతనమే భారతఖండము"--గాంధీమహాత్ముఁడు.

"శాంతినికేతనమును సందర్శింపనివాఁడుభారతదేశమును సందర్శింపనివాఁడే."—పండితనెహ్రూ.

రవీంద్రునకు నలుబది సంవత్సరముల ప్రాయము. అవిరామముగ సారస్వతసృష్టిఁ గావించుచున్నను, నాతని హృదయమా వేదనాభరితమై యాందోళిత మగుచుండెను. ఏదోయొక యవ్యక్త నూత్నజీవితారంభమున కాతని యంతర్వాణి ప్రబోధించుచున్నది.

భగవద్విశ్వాస విలసితములగు పెక్కు ప్రార్థనాగీతముల వ్రాసి, వార్ధకమున మఱింత మునివృత్తితోఁ గాలము గడుపుచున్న పూజ్యజనకుని పాదపద్మములమ్రోల నిల్చి రవీంద్రుఁడు వానిని గానముచేసెను. బ్రహ్మానందమును జేరలకొలఁది చూరగొన్న జనకుఁడు, తనయునేదైన నొక బహుమానమును గోరుకొమ్మనెను. అప్రయత్నముగ కొమరునినోట "శాంతి నికేతన" మనుమాట వచ్చెను. నాఁటినుండి శాంతినికేతన సర్వాధికారి రవీంద్రుఁడు. తన యాశయానుకూలముగ నతఁడు దానిని తీర్చిదిద్దెను. ఒకప్పుడది శాంతినికేతన తపోభూమి! ఒక సుముహూర్తమున నది 'శాంతినికేతన గురుకులము'గ మారినది. సర్వభారతము, కాదు, సర్వజగత్తు నొక్కమారుగ నీ నూత్న గురుకుల సంస్థాపనమునకుఁ బులకలుప్పతిల్ల సంపుల్లానంద హృదయమున నంజలించినది.

ఏ మహత్తరాశయము లీ పూజ్యమూర్తి నీ పుణ్యకర్మమున కుద్యమింపఁజేసెనో పరామర్శింతము: ఒక్కసారి తన బాల్యజీవిత మాతని కనులయెదుట పరిభ్రమించినది. ఆ పాఠశాలల నిర్జీవకృతక వాతావరణము, ఆనాఁడు తాననుభవించిన యావేదన, తన గృహావరణమునందలి నారికేళవృక్షములు, పత్రహస్తములతో తన్నొనదార్చుట – అంతయు చలనచిత్రమునందువలె నాతనికి ప్రత్యక్షమైనది. ఇంతలోఁ ప్రాచీన భారత ఖండమునందలి గురుకులములు, అందలి గురుశిష్య సంబంధము, వారి పవిత్ర జీవితములు, నొకదానివెంట నొకటి యాతని మనోవీధిని మసలినవి. సత్యాన్వేషకులగు నధ్యాపకులు జన సంకులములగు పట్టణములకు సుదూరముగ, సహజసౌందర్య సంశోభితములగు ప్రశాంత కాంతారములలో తమ నిలయముల నేర్పఱచుకొనెడివారు. వారి నన్వేషించుకొని విద్యార్థులందుఁ జేరెడివారు. వారిజీవితములు నిరాడంబరములు; భావములు మహోన్నతములు. జీవితమునకును, విద్యాలయములకు నవినాభావ సంబంధము. నాఁటి విద్యార్థులు కేవల విద్యార్థులేకాక బ్రహ్మచారులు. వారు పుస్తకములను జీర్ణించుకొనువారుకాక, సజీవపరిసరములందువర్ధిల్లు సుభగంభావుకులు. వారాలమందలను బచ్చికబీడులకుఁ దోలుచు, వంటచెఱకును బ్రోగుచేయుచు, పండ్ల నేఱుచు, నితాంతాపారభూతదయ నభివృద్ధి గావించుకొనుచు, తమ గురువర్యుల యాధ్యాత్మికోన్నతితోపాటు తాముసు నున్నతిని సాధించెడివారు. ఇందలి యధ్యాపకులు పుస్తకము

లకుఁ బ్రతిధ్వనులుకారు. సాంధ్యారుణరాగములలో హృదయాంతరాళములనుండి యుప్పొంగు నావేశముతోఁ భావముల నుద్బోధించెడివారు.

శాంతినికేతన ప్రతిష్ఠాపనావసరమున నిట్టి భావపరంపరలు రవీంద్రుని హృదయరంగమున నొక్కపరి నర్తనమొనర్చినవి. పాశ్చాత్యుల యాగమనముచే నిట్టి గురుకులములు నశించి నిర్జీవములగు పాఠశాలలు తలయెత్తినవని యాతడు దురపిల్లెను. తిరిగి యట్టి యాదర్శ గురుకులమును భరతావనిలో సంస్థాపించి గతించిన జాతీయజీవనమును పునరుద్ధరింపవలయునని వాంఛించెను. రూపుగొన్నట్టి యట్టివాంఛయే శాంతినికేతన గురుకులము.

తొలియేడాది యీ గురుకులమునఁ బంచ భూతాత్మకమగు సృష్టికిఁ బ్రతినిధులా యనునట్లు, ఐదుగురు బ్రహ్మచారులు ప్రవేశించిరి. అందు రవీంద్రుని పుత్రరత్నమొకఁడు. సుమసౌరభమునకుఁ దుమ్మెద లాకర్షింపఁబడునట్లు ప్రపంచము నలుమూలలనుండియు, క్రమముగ విద్యార్థినీ విద్యార్థభృంగము లీ నికేతన దివ్యసుమసౌరభమున కాకర్షితములై తదధ్యయన మరందసుధాస్వాదమున నమరములైనవి.

శాంతినికేతనమున ప్రతిదినకార్యకలాప మెంత రమణీయమో తిలకింపుడు.

బ్రహ్మముహూర్తముననే వైతాళికు లుదయగీతముల నాలాపించుచు నాశ్రమముచుట్టును దిరిగివచ్చెదరు. స్వల్ప

విరామముననే విద్యార్థులు తమతమ యాసనములతో నిర్ణీత ప్రదేశములకుఁ బోయి ధ్యాననిమగ్నులయ్యెదరు. "పితానోఽసి, పితానోబోధి, నమస్తేఽస్తు మామాహింసీః" అనునది వారి ధ్యానమంత్రము. అనఁగా "నీవు తండ్రివి, నీవే తండ్రివని నాకు బోధింపుము, మమ్ము సదా సంరక్షింపుమ"ని యీ మంత్రార్థము. ధ్యానానంతరము విద్యార్థులందఱు వృక్షచ్ఛాయల నిల్చి సమష్టిప్రార్థనలు గావింతురు. తరువాత పదిగంటలవఱకు విద్యాలయ కార్యకలాపములఁ జూచుకొందురు. విద్యాలయ మనఁగనే నేఁటి మన పాఠశాలలను బోలినదికాదు. వారికి నిర్ణీతమగు తరగతిగదులు లేవు. వృక్షచ్ఛాయలే వారి తరగతి గదులు. తరగతికి విద్యార్థులసంఖ్య యెనిమిది లేక పదికి మించదు. వారందఱు నధ్యాపకుని పరివేష్టించి ప్రశ్నలడుగుదురు. తమకు తోచిన యనుమానములఁ దీర్చుకొందురు. గ్రంథపఠనముతో బోధనచేయు టందులేదు. సంభాషణల మూలముననే బోధనము జరుగును.

తిరిగి మధ్యాహ్నము రెండుగంటలకు పనిని ప్రారంభింతురు. ఈపూట తమ కభీష్టమైన చేతిపనుల నేర్చుకొందురు. నాలుగుగంటలకే విద్యార్థు లత్యుత్సాహముతో కేళీరంగముల కుఱుకుదురు. సూర్యాస్తమయమునకు పూర్వమే తిరిగి యందఱు సమావేశమై మౌనముద్రతో దైవప్రార్థన సల్పుదురు. ఇట్టి యీ తీయని సాధన నే విశ్వవిద్యాలయమున మనము చూడఁగలము !

రవీంద్రుని మేనల్లుఁడు దినేంద్రనాథటాగూరు, శాంతి నికేతనాభివృద్ధికిఁ బాటుపడినవారిలో ప్రధానుఁడు. అతఁడు పాషాణములనుండి నవనీయుషమును బిండగల గాయకుఁడు. రవీంద్రుని గేయములలోఁగల సంగీత సాహిత్య మధురిమలను బోషించి, గానముచేసి బాలుర నానందాబ్ధి ముంచె త్తిడివాఁడు.

శాంతినికేతనమున విశేషించి పేర్కొనదగిన మఱియొక యంశము ఋతూత్సవముల జరుపుట. వసంతోత్సవము, శారదోత్సవము, ఋతుసంహారము మున్నగు గేయనాటిక లాయా సమయములలో విద్యార్థులచే నాడింపఁబడెడివి. వీనిని సందర్శించి ప్రకృతిమాత తనకు దురవలోకమైన తన శోభా రామణీయకమునకు లోలోన మురిసికొని ముసిముసి నవ్వులు నవ్వుకొనెడిది. అభినయము మూలమున నుత్సాహముతో విద్య నేర్పింపనగునని రవీంద్రుని విశ్వాసము. తదనుకూలముగ నితర విషయ సంబంధములగు పెక్కునాటికలను రవీంద్రుఁడు రచించి యనుకూల సమయముల విద్యార్థులచే నాడించెడివాఁడు. వీరితో తానును గొన్నిపాత్రలను నటించి విద్యార్థులయెడ తన మధురానురాగమును వ్యక్తపఱచెడివాఁడు. అట్టి నాటికలలో "పోస్టాఫీసు" రవీంద్రునకుఁ బ్రియతమమైనది.

రవీంద్రుఁడుగాని యితరాధ్యాపకులు గాని విద్యార్థుల నేరీతిగను శాసింపరు. వారు స్వేచ్ఛానందములతో విహంగముల వలె సంచరింతురు; అంతమాత్రమున వారలను స్వైర విహారముచే నాత్మ వినాశనమునకుఁ బూనుకొన నీయరు.

విద్యార్థులకు స్వయంపరిపాలనము గలదు. వారు తమ నాయకులను తామే యెన్నుకొందురు. ఆశ్రమ పారిశుద్ధ్యము, క్రమశిక్షణ మున్నగునవన్నియు విద్యార్థులే చూచుకొందురు. నేరములు చేసినవారిని విచారించుటకు విద్యార్థుల న్యాయసభయు ప్రత్యేకముగ కలదు. రవీంద్రుఁడీ విధానము నాంగ్ల, అమెరికా దేశములనుండి గ్రహించెను. ఎందులకు కొరగాక, 'రౌడీల'వలె సంచరించు తమ బిడ్డలను తల్లిదండ్రులు శాంతినికేతనమునకుఁ బంపెడివారు. నికేతన స్వేచ్ఛావాతావరణమే వారి కొక దివ్యౌషధముగ పనిచేసెడిది.

రవీంద్రుఁడు పాఠములను బోధించుటలో విద్యార్థుల మానసముల విప్పార్చుచు సత్యలోక సౌందర్యశోభల నవఘులింపఁజేసెడివాఁడు. తనవలెనే లక్ష్యశుద్ధిగల్గిన యధ్యాపకుల నాతఁడతికష్టముపై సంపాదింపఁగల్గెను, రవీంద్రుని యాప్త బంధువు 'సతీశచంద్రుఁ' డాంగ్లకవనము నుత్తేజకరముగా బోధించెడివాఁడు. నికేతనము స్థాపించి యేడాది తిరుగకమున్నే యీ యిరువదేండ్ల యువకుఁడు దివికేగుట రవీంద్రునకు మిక్కిలి నిరుత్సాహము కల్గించినది. ఆతని మధురాంగ్ల భాషా బోధనమును రవీంద్రుఁ డనారతము సంస్మరించి జోహారులు సమర్పించెడివాఁడు.

పాఠ్యగ్రంథములు, ప్రణాళికలకన్న నికేతన విద్యార్థులకుఁ బ్రకృతితో సన్నిహిత పరిచయ మేర్పఱచుకొనుట, సంగీత కవిత్వాది లలితకళోపాసన మొనర్చుట ప్రధానము. విద్యా

ర్థులు తక్కిన కళలతోపాటు జీవితము నొక కళగా నుపాసింతురు. అరమరలులేని జీవితము, చక్కని సౌమనస్యము, సర్వమానవ సౌభ్రాతృత్వము వారి కుపాదేయములు.

రవీంద్రుని మహోన్నతాశయముల కాకర్షితులై విదేశీయాధ్యాపకులుకూడ శాంతినికేతనమునఁ జేరుటచే రవీంద్రుని యానంద మతిశయించెను.

బాలురకుఁ బ్రత్యేకముగ మతబోధ సల్పుట రవీంద్రున కిష్టములేదు. భగవదనుభూతియే మతమనియు, భగవంతుని ప్రేమించి యారాధించుట, పరిసర ప్రభావమున బాలురయందు కల్గవలయుననియు నాతని యభిమతము.

శాంతినికేతన స్థాపన నిర్వహణాదికార్యములు రవీంద్రునకు సంతృప్తిని కల్గించినవి. కాని విధి దుర్విపాకమున నతఁడనేక దురంతదుఃఖముల దురపిల్లవలసి వచ్చినది. కష్టములొంటరిగా నెన్నఁడును రావుకదా! శాంతినికేతన మార్థికముగ బలహీనమగుచున్నది. అందు తొలుత యుచిత విద్య ప్రసాదింపఁబడినది. ఆ పద్ధతిని కొనసాగించుటకు ధనవంతుల నెందఱనో రవీంద్రుఁడు యాచింపవలసివచ్చినది. మానధనుఁడగు నామహితమూర్తి మానసమందుల కనేకవిధముల క్రుంగినది. ఇంతలో రవీంద్రుని మనసులో వర్తించు నర్ధాంగి, శాంతినికేతనమునకై తన పుట్టింటివారిచ్చిన నగలు సర్వము భర్తకు సమర్పించిన మహాసాధ్వి యాతని నెడబాసి స్వర్గమలంకరించినది. ఆకు కదలిక కలజడిఁజెందు రవీంద్రుని సుకుమారహృదయ

మీఁదుర్భర దుఃఖమునకు సుళ్ళుతిరిగినది. తన సర్వస్వము కోలు పోయినవానివలె కవీంద్రుఁడు కూలిపోయెను. కాని మహా కవులు తమకుఁ బ్రాప్తించు దుఃఖమును రసమయమగు కావ్య రూపమున నక్షరరమ్యము గావించి యానందమునఁ బర్యవ సింపఁజేసెదరు. "సంస్మరణ" మను కావ్యమును రవీంద్రుఁ డీసందర్భమున సృష్టించి దుఃఖోపశమన మందుచుండెను.

ఈ మహాదుఃఖ ముపశమింపకమున్నె యాతని ముద్దు పట్టి రేణుకాదేవి మంచముపట్టినది. ఆమెను గాపాడుటకై రవీంద్రుఁడు "ఆల్మోరా" పర్వతములకామెను గొనిపోయెను. మాతృహీనయు, రోగగ్రస్తయు నగు కూతు నానందపఱచు టకు "నెలవంక" యనుపేర మధురాతిమధురములగు గేయ ములఁ గూర్చెను. బాలుర భావనావిధానమును వ్యక్తీకరించు నీకావ్యరాజము బాలసాహిత్యమునకు మకుటాయమానమైనది.

రవీంద్రుని ప్రయత్నములన్నియు వ్యర్థములైనవి. రేణు కను దయాహీనయగు మృత్యువు గ్రసించినది. రవీంద్రుని హృదయమున దుఃఖదావానలము చెలరేగినది. మఱుసటి సంవత్సరము తన కన్నివిధములఁ బెన్నిధియు, నేడుగడయు నైనజనకుఁడు దేవేంద్రనాథుఁడు దివికేగెను. ఆ తరువాతి వత్సరముననే రవీంద్రుని పదుమూఁడేండ్ల కుమారుఁడు సోమేం ద్రుఁడు సురపురి నలంకరించెను. అప్పుడలలేక సమ్మెటపోట్లవలె మీఁదపడు నీ కష్టపరంపరలకు శోకసంతప్తుఁడగు తన పుత్రుని ప్రకృతిమాతయే సమాశ్వాసించినది. హాలాహలమును

హారుఁడుదక్క నన్యులు భరింపలేరు. అటులనే భగవద్దత్తమగు నీ మహాపరీక్షకు మహాకవిదప్ప సామాన్యులు నిలువలేరు.

కష్టము లనుభవించుకొలఁది ధీరుల బుద్ధులు సునిశితము లగును. కష్టములచే తాము కుంఠితులయ్యు, విశ్వశ్రేయము నకుంఠితముగ నిర్వహింతురు. కష్టపరంపరాహతమగు రవీంద్రుని హృదయక్షేత్రమున, సమృద్ధమగు కరుణారసముచే సంపోషితములై భావసహకార పాదపములు కావ్యామృత మధురఫలములను సహృదయలోకమునకు ద్విగుణీకృతముగ నందించినవి.

౧౧

పూర్వజన్మకృత సుకృత విశేషముచే కవితాకళాశ్రీ దివ్యాంశసంభూతులగు కొందఱు మానవుల వరించును. అట్టి కవులలో కొందఱియందే అట్టి కళాశ్రీ నిత్యసంవర్ధమానమై యాత్మోద్ధరణముతో పాటు, ప్రపంచోద్ధరణమునకును వెల్గు బాటల వెలార్చును. అట్టివారే మహాకవులు. వీరిని భారత దేశము ఋషితుల్యులుగా సంభావించినది. అందువలననే "నా నృషిః కురుతే కావ్యమ్" ను నార్యోక్తి.

రవీంద్రుఁడు జన్మతః కవి. కాలక్రమమున నాతఁడు తత్కళాప్రపూర్ణుఁడుగా పరిణమించెను. సామాన్యులగు కవుల కవిత్వము వారి భాషాప్రాంతావధుల నతిక్రమింపదు. కాని

రవీంద్రకవిచంద్రుఁడు తన మాతృభాషయందేకాక, యాంగ్ల భాషయందును సిద్ధహస్తుఁడౌట నాతఁడు తన రచనల నన్నింటిని నాంగ్లమునకుఁ బరివర్తించి ప్రపంచ సహృదయులకుఁ బంచి పెట్టుటచే నాతఁడు విశ్వవిఖ్యాతి నందెను.

బాల్యమున నాతని రచనలు భావశబలితములై, యను భూతియుతములై పఠితల నుద్రిక్తపఱచెడివి. ఆ కారణమున వంగీయు లాతనిని "వంగదేశపు షెల్లీ" యను బిరుదముతోఁ బిల్చెడివారు. వయఃపరిపాకమున నాతని యుద్రేకములు శాంతి వహించి, కవనవేగము మందగించినది. భావములు పచేళిమ ములై, రచన నిరాడంబరముగా సంప్రుష్టమైనది. అంతకంతకు కవీంద్రుని హృదయము సాగరగభీరతను దలదన్నుచుండెను. వివిధ వాఙ్మయ సంస్కారవాహిను లాతని ప్రతిరక్తనాళమున బ్రవహించినవి. అందుచే నాతఁడు భావించి, భావించి ప్రయో గించు ప్రతిపదమునను నిహితమైన గూఢార్థము సామాన్యు లకు బోధపడెడిదికాదు.

నిరాడంబరమగు భాషలో సస్తులమగు భావసంపదల నిముడ్చు టాతని కవితాశిల్పము. "టాగూర్ కవిత్వము నెంత చదివినను దనివితీరదు. నవనవోన్మేషమగు నర్థసంపదల నొలి కించు నా మహాకవిత మహాకవులకే యనూయాజనకమైనద"ను 'ఈట్సు' మహాకవి సుభాషితము సత్యసమ్మతము.

అది పందొమ్మిది వందల పదుమూఁడవ సంవత్సరము. రవీంద్రుని కవితాకీర్తిలత యేడువారాసుల కడపటికొండ కెగ

వ్రాసిన యోఁడు. సారస్వతమునకై నిర్ణీతమైన "నోబెల్" బహుమానము, లక్షరూప్యములవఱకు విలువకలిగినది, రవీంద్రకవిచంద్రుని కాతని "గీతాంజలి" కావ్యరచన కీయఁబడినది. అందలి ప్రతిగేయము, కాదు ప్రతిపదము, భారతీయ విజ్ఞానామృతమునం దోలలాడించునది. "గీతాంజలి భావములు పాశ్చాత్యులకు మిఱుమిట్లు గొలిపినవి ! సుమవర్షమట్లు పృథివిని నింపివైచినవి!! మణిమయమూఖములట్లు వసుమతి నలంకరించినవి!!! భారతమాత పెనఁ బశ్చిమఖండముల నొక్కమారు సాగిలఁబడఁ జేసినది గీతాంజలి!!! స్వార్థచింతలయందు మునిఁగి, మనుష్యత్వమునుండి దిగజాఱి గభీరకలుషమునఁ గూలఁబడువారి కింత తత్త్వబోధఁ జేసినది గీతాంజలి!!! జగదీశుని మహిమను గీర్తించి, నూతన యుగభావములను దశదిశల వెదఁజల్లి విజ్ఞానమునుగ్గుగఁ జేసి, పల్వురకు ముక్తిమంత్రము నుపదేశించిన దీగీతాంజలి!!"

గీతాంజలి మకుటములేని శతకమువంటిది. భారతీయ వేదాంతమును కవిత్వమను శర్కరముతో మేళగించి, రవీంద్రుఁడు సర్వజనానుకూలము గావించుటచే దాని కొకవిధమగు నూత్నత్వము ప్రాప్తించి, ప్రపంచ సారస్వతలక్ష్మి కొక యనిదంపూర్వాలంకారమైనది.

అందలి భావములు విశ్వజనీనములైనవి. మానవుని పాశవికశక్తుల నణఁచి, శుద్ధసాత్త్వికశక్తులను శోభింపఁజేయునవి. అందుచే ప్రపంచములోని యన్నిభాషలలోనికి గీతాంజలి

యనువదింపఁబడినది. కుల, మత, వర్ణ విభేదముల నతిక్రమించి సర్వమానవులచే గీతాంజలి యాత్మీయమైన కావ్యముగా పరిగణింపఁబడినది. ఈర్ష్యాసూయాది వివిధ మానసిక వ్యాధులచే నాత్మనాశమున కొడిగట్టుకొనుచున్న మానవజాతికి గీతాంజలి దివ్యౌషధముగఁ బనిఁజేసినది. రవీంద్రుని విశ్వకవిపీఠమున నిలిపి, విశ్వమానవులచే నర్ఘ్యపాద్యాది పూజల నందింపఁజేసినది గీతాంజలి!!

"నా ప్రపంచాయాత్రాంతరమున, ప్రపంచము నాల్గు మూలల సమస్తభారతమునకు పవిత్ర సంకేతముగ రవీంద్రకవిచంద్రుని భవ్యనామధేయమే వినిపించినది. ఒక సమయమున నేను 'బుడాపెస్టు' నగర వైద్యాలయమున కేగినప్పుడు రోగుల శయ్యలపై గీతాంజలి కావ్యమును గాంచి లోలోన నుప్పొంగితిని. ఒక సంవత్సరము 'స్కాండినేవియా'లో శీతకాలము గడపితిని. గీతాంజలి నందఱికన్న ముందుగ తన భాషలోని కనువదించిన స్వీడన్ దేశపు నారీమణి నా యాతిథేయి. రవీంద్రునిగూర్చి నన్నడుగవచ్చు జనాసీకమును సద్దునప్పటి కామె తలప్రాణము తోకకు వచ్చినది. ఒక పర్యాయము నేను నార్వే పర్వత సానువులకు విహారయాత్రగా నేగితిని. ఆ నిర్జనారణ్య ప్రదేశములయం దక్షరజ్ఞానశూన్యులగు రైతులుకూడ నన్ను రవీంద్రునిగూర్చి ప్రశ్నించిరన్న విశ్వసింపుడు. ఇస్సే యమెరికా, కెనడా, ఫ్రాంసు, జర్మని మున్నగు దేశములయందు రవీంద్రుని నామము నిత్యసంస్మరణీయముగా నున్నద"ని 'కవికోకిల' శ్రీమతి

సరోజనీదేవి సత్యసమ్మతముగ నొక సందర్భమున వచించి విశ్వవిఖ్యాతుఁడైన భారతీయ కవిచక్రవర్తి కభినందనము లర్పించినది. ఇంతయేల? ఐరిష్‌కవియగు 'విలియంబట్లర్ యీట్సు' గీతాంజలిని పఠించి తన్మయుఁడై పిచ్చివానివలె కేకలుపెట్టెనట!!

"అమృతాంశుని యేకాంత సహవాస ప్రభావముచే శీతల గభీరములైన సరోవర మృదులజల తరంగములట్లు గీతాంజలీకావ్యగాన మాపాతమధురముగా తొలిసారి నా చెవి సోకినంతనే, నా యాత్మ మంత్రముగ్ధమై పరవశత్వమున పరువులెత్తినద"ని 'సి. యఫ్. ఆండ్రూస్' అను సారస్వతవేత్త సాంజలితో గీతాంజలిని ప్రశంసించెను.

ఏవంవిధ యశోలతికలు పేరెములువారుచున్న యీ తరుణమున రవీంద్రుఁడాంగ్లావనికి రాగా, విశ్వకవి కాంగ్లదేశము విశ్వతోముఖముగ నఖండమగు సుచిరాగత మొసఁగి,సత్కరించినది. ఎచటపట్టినను స్త్రీ పురుష విచక్షణలేక యందఱి హస్తములందును తన కావ్యమలంకరింపఁబడుట చూచి యా మహాకవి తనజన్మ ధన్యమైనదని యానందాతిరేకమునఁ బరవశుఁడాయెను.

రవీంద్రుని గీతములు వివిధములు. అందు కొన్ని ప్రకృతి గీతములు. మఱికొన్ని దేశభక్తి ప్రపూరితములు; కొన్ని ప్రేమ గీతములు; కొన్ని వైష్ణవ సంప్రదాయ గీతములు.

ఇట్టి వివిధ గీతికాసంపుటములే "పండ్లగంప", "తోటమాలి" మున్నగునవి. "తోటమాలి"యం దీమహాకవి

ప్రదర్శించిన పవిత్ర సారస్వతసేవాతత్పరత ప్రశంసించుట కతీత మైనది. అతిరథులు, మహారథు లనుకొనువారు లాంఛన ప్రాయముగ భారతీదేవి సేవ గావించి, నీడ్కొనిన పిమ్మట, నేకాంతమున ప్రశాంతమనస్కుఁడైయున్న నా దేవి నీ 'తోట మాలి' సమీపించి సాష్టాంగముగ ప్రణమిల్లినాఁడు. అప్పటి వారి సంభాషణమిది:

దేవి: నీకు కావలసిన బహూకృతి కోరుకొనుము.

మాలి: తల్లీ! నిత్యము ప్రాభాతసమయముల ననవికసి తారవిందములచే నీ హస్తద్వయము నలంకరింప నిమ్ము! నీ పాదద్వయినంటిన ధూళిని, నా యధరములచే సమ్మార్జనము గావించి, యరుణారుణములగు నశోక పుష్పపత్రము లచే నలరఁజేయనిమ్ము!!

దేవి: నీ ప్రార్థనలను సమ్మతించితిని. ఓ మాలీ! నీవు నాపూల తోటకు నేఁటినుండి తోటమాలివిగా నియమింపఁబడితివి.

ఎంత మనోహర మీ వాంఛ! ఏమి వినీత మీతని శీలము!! ప్రపంచమున నే కవిగాని యిట్టి యభీష్టమును ప్రదర్శించెనా? అట్టి భాగ్య మీ కవీశ్వరున కొక్కనికే చెల్లినది.

పద్యరచనముననే కాక గద్య రచనమునను నీతఁడు పరిణత ప్రజ్ఞగలవాఁడు. అతఁడు పట్టి బంగారము గావింపని వాఙ్మయ ప్రక్రియ కానరాదు. నవల, కథానిక, రూపక, నాటిక, వ్యాసములను శరపరంపరలుగాఁ గురిపించిన సారస్వత సవ్యసాచి యితఁడు. ఆతని ప్రతిరచనయు నాంగ్లమునకుఁ బరివర్తింప

బడుటచే నవి ప్రపంచ సాహిత్యమునఁ బెట్టని సొమ్ములై, యాతని "విశ్వకవి" బిరుదమును సార్థక మొనర్చినవి.

"తన రచనల కన్నింటికిని సజీవ ప్రతిబింబమే కవీంద్రుఁడు. ఇది సృష్టిలో నొక యపూర్వ సంఘటనము"ను "స్టేట్సుమన్" పత్రికా ప్రశంస పరికింపఁదగినది.

"అరుణోదయ కాంతుల నానందాశ్చర్యములతోఁ బరికించుటకుఁ దనివితీరనియట్లు, మానవజీవిత గతులను బరిశీలించుట యందును నాతనికంతటి యాసక్తి. షేక్స్పియర్ మహాశయుని వలె నీతఁడు విశ్వతత్త్వమును వివిధ దృక్కోణములనుండిగాక యొకేయొక నిరాడంబర విధానమున గుర్తించును. బాల యువతీ యువక హృదయముల నిబిడముగ నిండియున్న యమాయికమగు ప్రేమ; సంసార జీవితయాత్రలోని నిష్కళంక ప్రణయము; పరమేశ్వరుని ముంగల నాత్మసమర్పణముఁ గావింపఁజేయు తీవ్రమగు నార్తి 'విశ్వకవి' కవిత్వమునకుఁ బ్రాతిపదికలు."

ఇంతటి మహాకవినిగన్న భరతమాత సర్వప్రపంచ సమ్మానము నందుటలో నాశ్చర్యమేమున్నది. విశ్వకవీ !! నీకు మా జోహారులు ! ! గురుదేవా ! నీకు మా జయవాదములు !!!

## ౧౨

పవిత్ర జాతీయభావములను దేశజనుల కుద్బోధించిన మహాపురుషులలో రవీంద్రుఁడు ప్రధానుఁడు. భారతజాతీయ

కవులలో నాతఁ డగ్రగణ్యుఁడు. ఆతని జాతీయత విశ్వజనీనమైనది. అందును భారతదేశమందలి యశేష జనగణములు, నిత్యచైతన్యముతో, వివిధ మతములకు, జాతులకు, సంస్కృతులకుఁ జెందియుఁ నానాత్వములో నేకత్వమునకుఁ గట్టుబడి యుండు టాతని కంతులేనిసంతోషమును గూర్చినది. అట్టి యానందాతిశయమగ్నహృదయముతో నాతఁడొక ప్రాభాత శుభముహూర్తమున "భారత భాగ్యవిధాత" కంజలించి, యక్షరరమ్యముగ లిఖించిన "జన గణ మన యధినాయక జయహే" యను గీతము నేఁడు స్వతంత్ర భరతావనికి జాతీయ గీతమై, వివిధ స్వరవైవిధ్యవిలసితమై, మాధుర్యగమన గమకములకు, నుదాత్తభావ గంభీరతలకు నాలవాలమై ప్రపంచ జాతీయ గీతములలో నుత్తమోత్తమముగ ప్రశంసల నందినది.

ఈ జాతీయ కవిచక్రవర్తి తన దేశీయులకుఁ బ్రసాదింపమని ప్రార్థించిన సమగ్ర స్వాతంత్ర్య స్వరూప మెట్టిదో సర్వదేశీయులు సమీక్షింపఁదగినది. "ఎచట భయరహితమగు మనస్సుతో మానవుఁ డున్నతశిరస్కుఁడై వర్తించునో! ఎచట విజ్ఞానము స్వేచ్ఛగా నాబాలగోపాలమున కందుబాటులో నుండునో!! ఎచట సంకుచిత భావకుడ్యముల భారముచే దేశము విచ్ఛిన్నము కాదో!!! ఎచట పరిపూర్ణత నాశించి దేశీయులు నిరంతరముగ కృషి సల్పుచుందురో!!! ఎచట సంపూర్ణ సత్యసమ్మతినుండి పలుకు లుప్పతిల్లునో!! ఎచట వినిర్మలహేతువాహిని నిర్జీవాచారప్రదేశ సంచారము నందదో!!

ఎచట మానసము దైవప్రేరితమై, నవనవోన్మీలనమగు భావక్రియాశక్తులకొఱకు కుబలాటపడునో!! అట్టి స్వాతంత్ర్య స్వర్గభూమి కో జనకా! నా దేశీయు లధిగమింతురుగాక !!"

పరప్రభుత్వమును రవీంద్ర దేశభక్తుఁ డపార సహన సద్భావములతో సమీక్షించెడివాఁడు. కాని యాయా సమయముల నాప్రభుత్వము మానవత్వమునకే విరుద్ధముగ నల్పు పాశవికచేష్టల కీతని హృదయ మావేదనపడెడిది. అట్టివానిలో "వంగవిభజనము", "జలియన్‌వాలాబాగ్" సంఘటనములు గొడ్డలిపెట్టులవలె నీతని గులాబిపూవువంటి లేతగుండియకుఁ దగిలినవి. అప్పుడాతని సహనము కట్లుత్రెంచుకొని యురికినది. వెంటనే తనకా యమానుష ప్రభుత్వమొసఁగిన "నైట్‌హుడ్" బిరుదమును తృణప్రాయముగఁ ద్యజించి తన తీవ్రమగు నసమ్మతిని తెలియజేసెను.

భారతీయు లజ్ఞానపంకిలమునఁ జిక్కి, యనదలవలె బయలాలకించుచుండగా పాశ్చాత్యులు వారికి విజ్ఞానభిక్షఁ బ్రసాదించిరని చరిత్ర తెలియని యజ్ఞానముతో "రత్‌బో" నను పాశ్చాత్యకన్య భారతీయులకు వ్రాసిన బహిరంగలేఖకు రవీంద్రుఁ డిచ్చిన ప్రత్యుత్తర మాతని యుత్తమదేశభక్తి కనుత్తమమగు నిదర్శనము. బ్రిటిష్ పాలనముచే భారతీయులకు గల్గిన యనేకానర్థముల నందాతఁడు విశదపఱచెను.

ప్రథమ ప్రపంచయుద్ధపిశాచము యూరపుఖండమున విలయతాండవము గావించుచున్న దినములలో శాంతిదూతగా

నీమహానీయుండు పాశ్చాత్యఖండమునఁ బర్యటించెను. పాశ్చాత్య మేధావుల నందఱను గలిసికొని ప్రపంచశాంతికై తన యావేదనను దెలియఁజేసెను. ఈ యవకాశమును బురస్కరించుకొనియే రవీంద్రుఁడు 'జపాను' దేశమునకుఁగూడ నేగెను. జపానీయుల కళాభిరతి యాతనికి సంతృప్తిఁగూర్చినది. అట్టి నిరతిని తన దేశీయులు నేర్చుకొనవలయునని యాతఁ డాశించెను.

టోకియో "ఇంపీరియల్ విశ్వకళా పరిషత్" సభాముఖమున గురుదేవులు జలదగంభీరస్వనమున ప్రాగ్దేశముల కర్తవ్య నిర్వహణము నిట్లు వినిపించిరి: "మనము ఆసియావాసులము. నేఁడీ ఖండవాసులు దాస్యాంధకారమున, నాత్మ విశ్వాసమును గోల్పోయి యున్నారు. ఒకానొకప్పు డీ ఖండవాసులే జ్ఞానజ్యోతులను జేఁబూని, దశదిశలను వెలుగొందఁజేసిరి. ఇది గర్వహేతువుగా భావించుకొని యుప్పొంగువారు నేఁటికినీ యున్నారు. కాని యది కేవలము ప్రశంసనీయము కాదు. మనల నావరించిన నిస్తబ్ధతకు మనము విచారింపవలయును. కర్తవ్యపథమున ముందంజ వేయవలయును. తిరిగి ప్రాచీన విజ్ఞాన వైభవోన్నతుల సాధింపవలయును.

సమస్త ఆసియా ఖండము నిద్రాణమైయున్న తఱిని జపానుదేశము హఠాత్తుగా మేల్కాంచినది. కాలానుకూలమగు నాగరకతా వాహినిలో తెరచాప లెత్తినది. పాశ్చాత్య విజ్ఞానమును స్వీయజాతీయభావానుకూలముగ మలచుకొని యభివృద్ధి గాంచినది. సమస్త ప్రపంచమునకే యీ ప్రగతి

విశ్రాంతి గొల్పినది. ఇట్లన్ని ఆసియాదేశము లభివృద్ధిగాంచు టభిలషింపఁదగును. కాని పాశ్చాత్యదేశముల నావరించిన దురహంకారపూరిత రాజకీయ నాగరకతా పిశాచమును మనము వేయికండ్లతోఁ గనిపెట్టి యుండవలయును. విద్యుద్వేగమున సాగిపోవుచున్న యీ పాశ్చాత్య నాగరకత యచిరకాలముననే యలసి సొలసి, యణగారిపోగలదు. నాఁడు తిరిగి యీ ప్రాగ్దిశాకాశమున దివ్యభానూదయమగును. ఈ ప్రాచీనాంబరమున ప్రతి నక్షత్రమును శాంతిసందేశగీతికలను ప్రశాంతముగ వినిపించును. కూపస్థమండూకస్థితిని విసర్జించి, విశాలభావప్రేరణతో నాసియాఖండవాసు లిట్టి శుభముహూర్తమునకు కృషి సల్పుదురుగాక !"

ఈ సందర్భముననే యితఁడా జపాను ప్రభుత్వవిధానమును ఖండించి దురాశాప్రేరితులై విశ్వశాంతికి విఘాతము కల్పింపరాదనికూడ హెచ్చరించి వారి కినుకకు గుఱియాయెను. మహాపురుషు లిచ్చకములాడి తమ పబ్బమును వెళ్ళబుచ్చుకొనువారుకారు. రాగద్వేషవిరహితబుద్ధితో వారు తమ సందేశమును వినిపింతురు. దాని నాలించి, యాచరించి, లోకకళ్యాణమునకు తోడ్పడుట లోకము కర్తవ్యము.

రవీంద్రుఁడీతరుణముననే పాశ్చాత్య జాతీయతను విమర్శించుచు నిట్లు వక్కాణించెను. "ప్రతీచీదేశములు తమ స్వార్థముకొఱకు పాశవికబలమును ప్రయోగింపరాదు. అజ్ఞానాంధకారమున నణగారియున్న దేశములకీ దేశములు వెలుఁగు

శాటలు చూపవలయును. పాశ్చాత్యులు తమ భౌతికవాద మును మానవులందఱిపై ఫులుమరాదు. తానైనను భౌతిక మను యవనికచాటున ప్రకాశించుచున్న దివ్యచైతన్యశక్తిని సందర్శింప యత్నించుట శ్రేయోదాయకము.”

ప్రపంచ నాగరకతా సౌధనిర్మాణమున పాశ్చాత్య ఖండము ప్రముఖపాత్ర వహించునని గురుదేవుని వాంఛితము. కాని యాఖండవాసుల స్వార్థపరత్వము, వారి సంకుచిత జాతీయ దురభిమానము, నాతని విశ్వాసమును సన్నగిలఁజేసినవి. దరిద్ర భరతావనినుండియే యెన్నటికైన ప్రపంచదుఃఖ విముక్తికారకుఁ డగు మహాపురుషుఁ డావిర్భవింపఁగలడను దన నిశ్చయమును వెల్లడించెను. తన రచనల నిట్టియాశయ ప్రేరితమైన జాతీయ భావముతోనే కావించెను. విలక్షణ జాతీయాంతార్జాతీయభావ విలసితుఁడగు విశ్వకవి భారతజాతి తపఃఫలము. ఆ మానవ సౌభాగ్యవాదికి సమస్తమహీతల మెంతైన ఋణపడినది.

## ౧౩

సునిశిత పరిశీలనమునఁగాని సృష్టిమర్మములు సువిదిత ములు కావు. పరిశీలనాత్మకమగునట్టి దృష్టి నూటికికోటికి నే యొక్కరిలోనో నిబిడముగ నుండును. అట్టి దివ్యచక్షువు రవీంద్ర కవీంద్రునకు భగవద్దత్తము. దానితో నాతఁడు ప్రజాజీవన విధాన మును, మానవ ప్రవృత్తిని పరిశీలించి, యందలి చైతన్యశక్తులను

క్రోడిచేసి కథలుగా గూర్చెను. కథాకథనమునఁగల యీ వైలక్షణ్యము రవీంద్రునకు కథావాఙ్మయ ప్రపంచమున నొకవిశిష్ట స్థానమును సమర్పించినది.

ఈతని కథ లనేకములలో నాతని బాల్యజీవితసంఘటనలు ధ్వనించును. అం "దస్థిపంజరము"నునది యొకటి. ఆతఁడు చదువుకొను దినములలో పఠనమందిరమున నస్థిపంజర మొకటి గోడకు వ్రేలాడుచుండెడిది. దానిమూలమున వారు శరీరమందలి వివిధావయవములను తెలిసికొనెడివారు. తీక్ష్ణపరిశీలనముచే నయ్యది బాలరవి మనసున హత్తుకొని రాత్రివేళ స్వప్నమునఁ గాన్పించి, తన జీవితవృత్తాంతమును నివేదించినది. ఆ యస్థిపంజర మొక యపూర్వసౌందర్యవతి శరీరోపాధి. ఇట్టి సంఘటనలనుగూడ విచిత్రమగు కథలుగ నల్లెడిప్రతిభ రవీంద్రునిది. "కాబూలివాలా" కథ జగత్ప్రసిద్ధమైనది. దేవేంద్రనాథుని పంజాబు పర్యటన సందర్భమున తత్ప్రాంతవాసు లెందఱో సేవకులుగా నాతని నాశ్రయించెడివారు. అట్టివారిని మనమునందుంచుకొని వ్రాసినదే యీకథ. ఇందు ద్రాక్షపండ్లమ్ముకొను 'నాఫ్గన్' భీకరాకారమును మనము మరువజాలము. చీటికి మాటికి కతఁడు చిరాకుపడుచు కత్తిదూయుట, ఇల్లుండియు పసిబిడ్డ పలుకుల కాతనిహృదయము వెన్నవలె కరుగుటను రవీంద్రుఁడు రసవత్తరముగ చిత్రించెను.

మూగబిడ్డ 'సుభ' రవీంద్రునకు ప్రియతమమగు కథాపుత్రిక. మూగదైనంతమాత్ర సుభకు భావుకత్వమే లేదని

సాటివార లామె నవమానింతురు. అయిన నామె ప్రకృతి మాతకు ముద్దుబిడ్డయై తనవలె నోరులేని పశువులతోఁ జెలిమిఁ జేసి సంబరపడెడిది. భారతదేశమున నవివాహితయగు స్త్రీ యుండరాదు. అట్లుంచిన వారిని సంఘము బహిష్కరించును. సుభ తల్లిదండ్రు లిందులకు భయపడి మోసమున నామె కంఠమునకుఁ గట్టించిన మంగళసూత్ర మామెపాలిటి కంఠ పాశమే యగును. ఇట్లే మన స్తత్వ పరిశీలనముతోఁ గూడిన మఱియొక కథ "గృహాగమనము". ప్రేమాస్పదయగు జనయిత్రి స్వభావమును గుర్తింపజాలక 'పథిక్' అను బాలుఁడు మేనమామయింట నుండును. కాని అసహనమూర్తియగు నతని యత్త గయ్యాళి కాతఁడు నిలువలేక పలాయనమంత్రము పఠించి విఫలుఁడై కడకచ్చటనే మంచము పట్టి ప్రాణములఁ బాయును. ఈ తీరున రవీంద్రుని కథలన్నింటిలో సంపూర్ణ మానవత్వము, నార్ద్రహృదయము, మానసికమగు నున్నత స్థాయి ప్రతిపదమునఁ దొణికిసలాడును.

రవీంద్రుని నవలలు వంగదేశ ప్రజాజీవన ప్రతిబింబక ములు. ఆతని "గోరా" యాతని చిననాఁటి కలకత్తానగర ప్రజాజీవనమును బ్రతిబింబించును. ఆతని "ఇంట - బయట" యనునవల ప్రపంచప్రశంసఁబడసినది. ఇందు ముచ్చటగ ముమ్మూరే పాత్రలు. భార్య, భర్త, యతనిమిత్రుఁడు. అల్ప సంఖ్యాకమగు పాత్రలతో ననల్పమగు నవలను సృజించుట రవీంద్రుని ప్రతిభకు చక్కని తార్కాణము. అందలి

'నిఖిల్' జాతీయభావములు రవీంద్రుని యభీష్ట జాతీయ భావములే. "భగ్నసౌక" యను సింహళ నవల రాజకీయ సంఘటనలతోఁ గూడినది. వినోదార్థము నవలలు రచింప వలయును గాని యుపదేశార్థము కారాదని యొక వాదము కలదు. రవీంద్రుఁడీ రెండు వాదముల పరమార్థ మెఱిఁగి తన నవలలో నుపదేశమును వినోదమునఁ బొందుపఱచి ప్రత్యే కతను ప్రదర్శించెను. భారతీయ సామాజికవ్యవస్థలోని దోష ముల నెత్తిచూపి వాని సంస్కరణ విధానమునుగూడ సూచిం చెను. నవలలోని పాత్రములు సజీవములుగ పఠితలకుఁ బ్రత్యక్షమై యాజీవితము మానసమున మసలుచుండెడివి.

ఇయ్యవి 'నవలా' బృందావనమున వేణుగోపాలుని మురళీరవములఁ బోలినవి !

## ౧౪

రవీంద్రుని నాటికలను గూర్చియు, నభినయాభినివేశ ములఁ గూర్చియు నితఃపూర్వము ముచ్చటించితిని. అతని నాటి కలలోఁ గొన్ని కేవలము సంభాషణాత్మకములు; కొన్ని నటనా ప్రధానములు; కొన్ని నృత్యసంగీతాత్మకములు. నృత్యనాటికలు నవనవోన్మేషముగ నిర్వహింపఁబడెడివి. 'వాల్మీకి ప్రతిభ' 'ముక్తధర్మము' 'సన్యాసి' 'నర్తకిపూజ' వీనిలో ప్రధానములు.

'చిత్రాంగద' రూపకము విశిష్టమై, శాంతినికేతనమున కభిమాన పాత్రమైనది. ఇది నృత్యసంగీత సంభాషణములు మూఁడును తనలో మలచుకొన్నది. అర్జునుఁడు చిత్రాంగదను బరిణయమాడుటయే యిందలికథ.

"నా నాటికలలో నానేక భావనాప్రపంచము ఛాయా మాత్రముగ గోచరించును. అయ్యది యనంత విశ్వస్వరూపము లోని యంతర్భాగము మాత్రమే" యని ప్రాసంగికముగ రవీంద్రుఁడు నుడివెను. రవీంద్రుఁ డేబది సంపుటములుగ రచించిన రూపకముల సార మీసూక్తి-వాక్యమున నిమిడియున్నది. ఆ కవిరాజహంస తాను విహరించు దివ్యలోకములకు తన ప్రేక్షకులనుగూడ గొంపోవ యత్నించును. తన కసభ్యస్తముగ నలవడిన వివిధ లలితకళాచణత్వమును రవీంద్రుఁడు తన రూపకములయందు వినియోగించి, "నాటకాంతం హి సాహిత్యమ్" అను వాక్యమును సార్థకపఱచెను. ఇందాతఁడు ప్రాక్ప్రతీచీ కళాసంప్రదాయముల నవలంబించి, యన్యభారతీయ రూపకములకు లేని విశిష్టత నాపాదించెను.

రవీంద్రుని 'శిశిరోత్స'వాది నాటికాగుచ్ఛమునం దాతని స్వాప్నిక విశ్వసౌందర్యము గోచరించును. ఇవి ప్రకృతికి భాష్యములు. భావానుభవమే ప్రధానమైన వీనిని పామరజనసుబోధక మొనర్చుటకు రవీంద్రుఁడు యావచ్ఛక్తిని ధారవోసెను.

మొత్తముపై రవీంద్రుని రూపకరచన షేక్స్పియర్, బెర్నార్డుషాలవలె కేవల వాస్తవిక ప్రపంచ ప్రతిబింబముగాక

సౌందర్యసముద్దీప్తమై ఆంతరంగికానుభవ ప్రధానమగుటచే వాని నానందించుటకు, ప్రేక్షకునకు కొంత శిక్షణ యవసరము.

౧౫

ప్రథమ ప్రపంచ సంగ్రామము జరుగుచుండగా రవీంద్రుఁడు యూరపు, అమెరికా ఖండముల నొకమారు సంచరించి, యఖండ గౌరవమును సంపాదించెను. జగద్యశోవిలసితుఁడగు నతఁడు తన భుజస్కంధములపై నూతనములగు బాధ్యతలు మోపఁబడినట్లు భావించెను. ప్రపంచ మేధావులు, విద్యావేత్తలు, రవీంద్రు నొక సామాన్యకవీంద్రునిగా కాక ప్రాక్పశ్చిమ గురుదేవునిగా సమ్మానించి, ప్రపంచ సమైక్యమును గూర్చుఁడని యతనిని సవినయమున వేడికొనిరి. ఆతని దృష్టి కుల, మత, జాతి, వర్ణవిభేదముల నథఃకరించి సర్వమానవ మహాకుటుంబమును సర్వదా సందర్శించుచుండెను. ఒకచో నీ మానవకుటుంబము చేరి పరస్పర సంస్కృతీ విజ్ఞాన వినిమయ చిత్తసంస్కారములతో నభివృద్ధిగాంచు టెట్లాయని తీవ్ర యోచనా నిమగ్నుఁడాయెను.

ప్రాచీన భారతీయ విశ్వవిద్యాలయములగు నలంద, తక్షశిల, అమరావతి, శ్రీపర్వతములు భారతీయులకేకాక, సర్వమానవాళికి విజ్ఞానామృతమును బంచిపెట్టెనను చారిత్రక సత్యము నాతఁడు గుర్తించి యట్టి పద్ధతులపై నొక విశ్వ

విద్యాలయమును సంస్థాపింపవలయునని నిశ్చయించెను. ఈతని యీ నిశ్చయమునకు శాంతినికేతనమునఁ బనిచేయు పాశ్చాత్యాధ్యాపకులు సి. యఫ్. ఆండ్రూస్, పియర్సన్ చేయూఁత నొసఁగిరి. తిరిగి రెండుమారులు రవీంద్రుఁడు విదేశములను బర్యటించి తన విశ్వవిద్యాలయ స్థాపనోద్యమమును విశదముగఁజెప్పెను. అందఱును నామోదమునఁదలలుపంకించిరి. వెంటనే కవీంద్రుఁడు శాంతినికేతనాశ్రమ కవాటములు తెఱచి, "విశ్వభారతి"నందు ప్రతిష్ఠించి "యో సత్యాన్వేషకులారా!! యో విశ్వమానవ సహోదరులారా !! క్షుద్రమగు రాజకీయ, జాతి, మత కక్ష్యల నతిక్రమించి, ప్రాక్ప్రతీచీ సత్యసమ్మేళమున కహరహము కృషిసల్పుఁడ"ని జలదగంభీరస్వనమున నుపన్యసించెను. విశ్వభారతి, విశ్వకవి నాశీర్వదించుచు నాశీఃకుసుమముల వెదజల్లినది. శాంతినికేతన కన్య 'విశ్వభారతి'కి దివ్య నిరాజనము నొసఁగి, పరిచర్య సల్పినది.

ఆహా ! 'విశ్వభారతి' యెంతటి మధురనామము ! ! "యత్ర విశ్వమ్ భవతి ఏకమిదమ్" "ఎచట విశ్వమేకత్వము వహించునో" యది విశ్వభారతి. "విశ్వభారతి" యన "విశ్వ సంస్కృతి" యనియు నర్థమే. లౌకికు లర్థము ననుసరించి పదము లుపయోగింతురు. ఋషిసత్తముల వాక్కున శబ్దము నర్థ మనువర్తించును.

విశ్వభారతీ విశ్వవిద్యాలయమును మూఁడుశాఖలుగ విభజింపవచ్చును. అందు ప్రథమము భారతీయశాఖ. ఇందు

భారత దేశమందలి పలు రాష్ట్రముల చరిత్రయు, వాని సాంఘిక, సాంస్కృతి కాచారసంపదలును, సారస్వత విశిష్టతలును, బోధింపఁబడును. అనంతరము వాని నన్నింటిని సమన్వయించి వీని ప్రభావమున విశిష్ట భారతీయ సంస్కృతి యెట్లు రూపొందినదియు నుద్బోధింపఁబడును. మణిపురము, కథాకళి, కూచిపూఁడి నృత్య సంప్రదాయములు, చిత్రలేఖనము, బౌద్ధగాంధార శిల్పపద్ధతులు; వేయేల! భారతజాతికి విశిష్టతనుగూర్చిన సమస్తము సాకల్యముగ నేర్పఁబడును.

ద్వితీయము ఆసియాశాఖ. ఇందు సింహళము, టిబెట్టు, చైనా, జపాను, బర్మా, మలయా మున్నగు దేశముల చారిత్రక సంస్కృతీ విశిష్టతలు, సంగీత చిత్రలేఖనాది కళా సంప్రదాయపార్థక్యము బోధింపఁబడును. భారతదేశమువలె చైనాదేశము ప్రాచీన నాగరకతా సంపద్విశిష్టమైనదని గుర్తించిన గురుదేవుఁడు, స్వయముగ తాను చైనాదేశమున కేగి, సోదర చైనీయులను సహృదయముసఁ బల్కరించి, సంతోషభరితుఁడై తన విశ్వభారతిని 'చైనా భవనము' నొకదానిని నిర్మించి, యందు చైనా, టిబెట్టుదేశ సంస్కృతీ చరిత్రలు ప్రత్యేకాసక్తితో బోధింపఁబడునట్లు సదుపాయములను సంతరించెను. జపాను, జావా, సుమత్రా, మలయా మున్నగు నాసియా దేశములలోఁ బ్రవర్ధమానమగుచున్న కళాసంప్రదాయములు తెలియఁజేయుట కొకప్రత్యేక కళాసిలయముకూడ సంస్థాపింపఁ

బడినది. అందలి చిత్ర వస్తు ప్రదర్శనశాలలోని ప్రతిచిత్రము నీ పురాతనఖండ ప్రతిభాప్రాభవములను వేనోళ్ళచాటును.

ఇంక తృతీయశాఖ — సర్వప్రపంచమునకు సంబంధించినది. ఇయ్యది ఆసియా - యూరప్ - అమెరికా ఖండముల సంస్కృతీవాహినుల త్రివేణీసంగమస్థానము. వీని సమైక్యమే ప్రపంచ చరిత్ర యని గురుదేవుని విశ్వాసము. పాశ్చాత్యులు తమ భౌతికసంపదలను, పాశవికబలముచేఁగాక, ఆత్మశక్తితోడనే సాధింపగల్గిరని, యట్టి సంపద జగత్కాళ్యాణమునకుఁ దోడ్పడవలయుననియు, గురువర్యుఁడు వారల కుపదేశించెను.

కుల, మత, వర్గ విభేదములు వాసనామాత్రముగనైన విశ్వభారతిలో నుండరాదు. అవియేకాదు. ప్రాంతీయ, జాతీయ తారతమ్యములుకూడ నిందు తలయెత్తరాదు. సర్వమత ప్రవక్తలను విశ్వభారతి సమానముగ ప్రతిసంవత్సరము నారాధించును. ఎవనికివాఁడు స్వకీయాభిరుచులనుబట్టి సత్యాన్వేషకుఁడుగా రూపొందుచు, పరులమార్గముల విమర్శింపక, సహానముతో గుర్తించుటకు యత్నింపవలయును.

విశ్వభారతి సంస్థాపించిన దినములు భారతదేశచరిత్రమున కడు దుష్కరములైనవి. కర్మవీరుఁడగు గాంధీమహాత్ముని నాయకత్వమున సర్వభారతము స్వాతంత్ర్యసమర శంఖారావమును బూరించిన సమయ మది. అందుచే గురుదేవుని యాశయములు సర్వ మానాఁడు కార్యరూపముదాల్చుట కవకాశము లభింపలేదు. నేఁటికిని గురుదేవుఁడు కలలు గన్నరీతిని

విశ్వభారతి తీర్చిదిద్దఁబడలేదు. వివిధదేశ సంగీత కళాసంప్రదాయముల బోధించుశాఖ యింతవఱకు నెలకొల్పఁబడలేదు. నేఁడు విశ్వభారతిని భారత జాతీయప్రభుత్వము నిర్వహించుచున్నది. గురుదేవుఁ డాశించినట్లు విశ్వభారతిని సమగ్రము, సర్వతోముఖము గావించి, విశ్వసమైక్యమునకుఁ దోడ్పడుట ప్రభుత్వము బాధ్యత!!

## ౧౬

రవీంద్రునకు గ్రామపునరుద్ధరణ కార్యకలాపముల యందున్న యాసక్తినిగూర్చి పూర్వము కొంత పేర్కొంటిని. ఆ పరువమున నతనియందు ప్రభవించిన గ్రామసౌభాగ్య సంపత్సంబంధములగు నాశయపుష్పము లీప్రాయమున నతనిలో ఫలించిన వనుట కాధారము 'విశ్వభారతి'యందు శ్రీనికేతనమును గురుదేవుఁడు ప్రత్యేకముగా నెలకొల్పుటయే. భారతీయ గ్రామ పునరుద్ధరణమన్న సంపూర్ణముగ శిథిలమైన సౌధమును బునర్నిర్మాణ మొనర్చుటయే. అందులకెంతేని దూరదృష్టి, సమగ్ర పరిజ్ఞాన మత్యావశ్యకము. అనుభవశాలియగు గురుదేవునియం దిట్టివి కొఱవడని గుణములు. అందుచే తత్సంబంధమగు బోధనమునుగూడ గురుదేవుఁడు విశ్వభారతియం దేర్పాటు చేసెను.

'శ్రీ నికేతనమ'ను బదమునసే రవీంద్రుని యాశయము లిమిడియున్నవి. 'శ్రీ' యనఁగా చైతన్యోద్బుద్ధమగు సంప

త్సౌభాగ్యము. నికేతనమనగా నిలయము. మొత్తముపై "సంప త్సౌభాగ్య నిలయమ"ని యర్థము.

శ్రీ నికేతనమున నొక యాదర్శ వ్యవసాయ క్షేత్రము కలదు. ఇందు వివిధ సస్యములు శాస్త్రపద్ధతులపై పెంచఁబడి, రైతులకు తద్విధానము సుబోధ మొనర్చఁబడును. ఆరోగ్యశాఖ, సహకారసంఘశాఖ, విద్యాశాఖ లిందు ముఖ్యములు.

సహకార సంఘము నిత్యము శకటముపై పరిసర గ్రామములు సంచరించి గ్రామీణులకు సహకార పద్ధతులపై వ్యవసాయమును గావించుటలోని మేళ్ళను, పరస్పర సహకార సద్భావములను ప్రచార మొనర్చును. ఇట్లే ఆరోగ్య సంఘము గ్రామములందు తిరిగి యుచితముగ మందులిచ్చి రోగనివారణ మొనర్చుట యేకాక, ఆరోగ్య సంరక్షణోపాయములను, గ్రామ పారిశుద్ధ్యమును గ్రామస్థులకుఁ గఱపును. పరిసర గ్రామములలో నొక యెడాది మలేరియాపిశాచము రైతులను బీల్చి పిప్పిఁజేయు చుండగా, నందు ప్రత్యేక నిపుణుఁడగు డాక్టరు 'హారీటింబర్స'ను నొక యమెరికను నాయకత్వమున నీ సంఘము గావించిన ప్రజాసేవ ప్రస్తుతింప నలవికానిది.

ఇందలి విద్యాశాఖ వయోజన విద్యాప్రచారము గావించునది. 'శిల్పభవనము'ను పారిశ్రామిక పాఠశాలయందు పలురకములగు చేతిపనులు విద్యార్థుల కత్యుత్సాహ పూర్వకముగ నేర్పబడును. ఇందు సిద్ధమైన వస్తువులను విక్రయించుటకు కలకత్తా నగరమున నొక విక్రయశాలయు కలదు.

ఈతీరున గ్రామసౌభాగ్య సాధనావిధానముల నన్నింటిని క్రాంతదర్శనుఁడగు గురుదేవుఁడు తన శ్రీనికేతనమున నేర్పఱిచెను. ఈనికేతనాశయములను, నాచరణవిధానములను జాతీయ ప్రభుత్వము లనుసరించిన గ్రామసౌభాగ్యము కరతలామలక మగునుగదా !

## ౧౭

భారతదేశము వేదాంతమునకుఁ గాణాచి. చరిత్రకందని యనంతకాలమునుండియు నీ దివ్యభూమి తన యమరవేదాంత సందేశమును సర్వజగతీతలమునకు వినిపించుచునే యున్నది. ఉషఃకాంతులు తమస్సులనుజీల్చి, విశ్వమునకు నవజీవనమును బ్రసాదించు ప్రాభాతసమయముల నార్యఋషులు ఋక్సామముల నుద్గ్రీవముగ గానముచేసిరి. వేదవిహిత కర్మాచరణానంతరము బ్రహ్మజిజ్ఞాస గావించుచు, వారౌపనిషద్రహస్యములఁ బ్రవచించిరి. అనంతర మీ భారతీయ విజ్ఞాన మహాతరంగిణిని సర్వమానవ సౌభాగ్యమును జేకూర్చుటకై యవతారపురుషుల లీలావిలాసములు ప్రతిబింబించు పురాణేతిహాసములతో నింపిరి. అవిచ్ఛిన్నముగ ప్రవహించు నీ మహావాహినిలోని కనేక సంస్కృతీవాహికలు కాలానుగతముగ ప్రవహించి తద్వాహినిని విస్తృతమొనర్చినవి. ఇట్టి మహావిజ్ఞానవాహినిలోఁ దనివి తీరఁ గ్రుంకులిడిన మహితమూర్తి రవీంద్రగురుదేవుఁడు. స్వకీయ

ప్రతిభానుభవముల కనుగుణముగ నీ నవయుగ ధర్మప్రవక్త భారతీయ వేదాంతరహస్యములను ప్రవచించి, యాత్మీయ జీవితమునకు ధన్యత సంపాదించుకొనుటయే కాక, పలువురు జిజ్ఞాసువులకు సమన్వయమార్గమును ప్రసాదించెను.

సత్యశివసుందరములను త్రివిధమార్గముల నేకమొనర్చి, తన్మార్గమునఁ బయనించి జీవిత లక్ష్యములను సాధింపఁజూచిన వాఁడీ కవి. వాస్తవిక ప్రపంచమును దిరస్కరించిన శుష్క వేదాంతికాఁడీతఁడు. బాహ్యాభ్యంతరములకు సమన్వయమును గుదుర్చుకొని, భూమిని విడువక, యాకాశమునందు కొన వలయునని యాతని యుద్బోధ. మానవుని దేవునిగను, దేవుని మానవునిగను బరివర్తింపఁజేయుటయే యాతని సాధన. సృష్టికి మకుటాయమానము మానవ సృష్టి. మానవత్వమే దైవత్వ మనునది రవీంద్రుని వేదాంత దృక్పథమునకుఁ బ్రాతిపదిక. ఎక్కడనో దూరసీమలలో నాతఁడు దేవు నన్వేషింపఁడు. శరన్మేఘమండలములలోను, కోకిలారవ రమణీయ వసంతముల లోను నతఁడు దైవమును సందర్శించి యానందపరవశుఁడగును. "ఏకః పరమాత్మా బహుజీవన రూపకః" యను సత్యసూత్రమే యాతని యఖండ తత్త్వము.

మత్తావిష్టుఁడైన మానవుఁ డనఁగా నాతని యుద్దేశ మున ధర్మమానవుఁడు. అనఁగా తనయందు నిహితముగనున్న సర్వశక్తులు సంపూర్ణముగ వృద్ధిపొందించినవాఁడు. తనలోని నీచ తమోగుణము నశింపఁగా, శుద్ధసాత్త్వికగుణముచే

శోభిల్లువాఁడు. అట్టి మానవుఁడు ప్రేమరస్త్రైక జీవనుఁడు. "ఎట్టి పరిస్థితులయందును ప్రేమసూత్రమును విడనాడనట్టి ధైర్యస్థైర్యములను ప్రసాదింపుము. మనోవాక్కర్మలయందు నీ యాదేశానుసారమే వర్తించుటకు; నెన్ని యిడుములనైన ననుభవించుటకు, సర్వమును త్యజించుటకు; కడకేకాకినై పోవుటకు, శక్తి ననుగ్రహింపుము. ప్రేమసూత్రముపట్ల చలింపని భక్తి విశ్వాసములఁగూర్పుము. మృత్యువులో నమృతత్వమును, పరాజయమున విజయమును, సౌకుమార్యమున గర్భితమైన పటిమను, ప్రతీకారచింతలేక యెన్ని బాధలనైన ననుభవింపఁగల ధీరోదాత్తతను వరమిమ్ము"ని యాతఁడు నిఖిల రసామృత మూర్తిని నిత్యము ప్రార్థించును. ఇట్టి యీ మధుర సాధనను 'సాధన' యను ప్రత్యేక గ్రంథమున గురుదేవుఁడు విపులీకరించెను.

ఎచటనో మోక్షమున్నదను విశ్వాసము గురుదేవునకు లేదు. జన్మరాహిత్యము నతఁడభిలషింపఁడు. "ఈ చిన్ని మురళితో, నెల్లప్రొద్దులు నిచట, వన్నెవన్నెలగీతి వాయింపఁగల్గితే, వలదు మోక్షము నాకు, వలదు ముక్తియు నాక"ని పునర్జన్మాసక్తిఁ బ్రకటించుచు గీతాలాపనము చేసినాఁడీకవి. కర్మాచరణమును విడనాడి, తలుపులు బిగించుకొని జపమాలలను త్రిప్పుచుండుట సరిపడదు. "గట్టిగా భూమిదున్నెడివాపువాని" చెంతను "కూలికై ఱాపలకంకర గొట్టువాని" ప్రక్కను భగవానుఁడున్నాఁడనియు, నాతఁడు ముముక్షువుల కెఱిగించెను.

భగవానుఁడు కూడ కర్మబంధమును సంతోషముతోఁ దాల్చి యున్నాఁడనియు, అట్టియెడ మానవులు కర్మవిముక్తికి సందులు గొందులు వెతకుట అవివేకమనియు నాతఁడు హెచ్చరించెను. సంపూర్ణమానవుఁడు భక్తిజ్ఞాన కర్మమార్గములకు నేకవాక్యత కుదుర్చుకొని, యసత్యమునుండి సత్యమునకు, తమస్సునుండి జ్యోతికి, మృత్యువునుండి యమృతత్వమునకు నధిగమింపవలయు నని గురుదేవుల గుసతరోద్బోధ!!

పంచేంద్రియములను బంధించుకొనక, సుస్థిర సౌందర్యో పాసనముచే నఖిల రసామృతమూర్తి యనంత సౌందర్య విలాస ముల ననుభవించుటయే యీ కవిప్రవక్త మతము. మృత్యు కఠోరదంష్ట్రికలయందును దరహాస చంద్రికాధావళ్య లావణ్య మును గుర్తించుటే యీ గురుదేవుల యభీష్టము. వేదనా సుధారసాస్వాదనముచే నమరత్వమును సాధింపఁ డనునదియే యీ యమృతమూర్తి యందించు నమరసందేశము !!

౧౮

మహాత్ములను, మహాకవులను, మహాప్రవక్తలను నిత్యము ప్రపంచమునకు సమర్పించు "పచ్చి బాలింతరాలు మన భరతమాత!" భారత భాగ్యవిధాతయైన గాంధీమహా త్ముఁడు, విశ్వకవి చక్రవర్తియగు రవీంద్రుఁడు, పతిత భార తము నుద్ధరించుట కేక కాలమున నవతరించిన కారణజన్ములు.

తమతమ రంగములలో వారు సర్వమానవ శ్రేయస్సునకై నిరంతర కృషిసల్పి, భారతదేశ ప్రతిష్ఠను సమున్నతము గావించిరి.

రవీంద్రుఁడు మహాత్మునికన్న వయసులోఁ బెద్దవాఁడు. భారతీయ సంప్రదాయ విజ్ఞాన సర్వస్వమును హస్తంగతము గావించుకొనిన ఋషిసత్తముఁ డీతఁడు. అందుచే మహాత్మునకు రవీంద్రునిపైఁగల భక్తి యపారమైనది. రవీంద్ర సందర్శనమున మహాత్ముఁడు సమస్తవైదిక వాఙ్మయము సాక్షత్కరించినట్లు భావించి, "గురుదేవా!" యని నమస్కరించెడివాఁడు. సర్వము నెఱింగిన మహాత్ములెప్పుడు నిట్టి వినయ వినమితవర్తనులే!

వీరిరువురిని తారతమ్యపరీక్షకు నిలువబెట్టి నిరూపింప నెంచుట నెరవేఱునట్టి కృత్యముకాదు. "రవీంద్రుఁ డథునాతనుఁ డగు 'ప్లాటో'యనియు, గాంధి యపర సెంట్‌పాల్" అనియు 'సి. యఫ్. ఆండ్రూస'ను నాంగ్లవేత్త సూత్రప్రాయముగ నుడివెను. గాంధి వాస్తవికవాదియైన, రవీంద్రుఁ డాదర్శవాది యనియు, నతఁడు సత్యోపాసకుఁడైన, నితఁడు సౌందర్యోపాసకుఁడనియు, నతఁడు కర్మయోగియైన నితఁడు జ్ఞానయోగి యనియు, నాతఁడు నాకథునియైన నితఁడు సింధూపూర మనియు, అతఁడు ప్రచండ భాస్కరుఁడైన, నితఁడు షోడశ కళాపూర్ణుఁడనియు, నేవియేవియో విభేదములు స్థూలదృష్టికి గోచరింపవచ్చును. కాని సూక్ష్మదృష్టిని తిలకించిన వీ రిరువురి మతములు గంగాయమునలవలె సంగమించునవియే యని విజ్ఞులకు విశదమౌను,

ఈ జ్యోతిర్మూర్తుల సమావేశమొకటి వారి సూక్ష్మ మనస్తత్వముల విస్పష్టము జేసి, మానసాహ్లాదమును గూర్చున దిదిగో గమనింపుఁడు :—

శాంతినికేతనాశ్రమమునకు మహాత్ముఁ డేతెంచి కతి పయదినములు కాలక్షేపము చేయనున్నాఁడను వార్త తెలియఁ గనే నికేతన విద్యార్థులు సమధికోత్సాహమున స్వాగతోత్స వమున కేర్పాట్లు గావించిరి. కళాభవనములోని నొక మంది రము బాపూజీకి నియోగించిరి. నికేతన చిత్రకారుఁడు 'నంద లాల్ బోసు' సౌందర్యలాంఛనములగు చిత్రములతోను, చిత్ర విచిత్రములగు తోరణములతోను దాని నలంకరించెను.

నిర్ణీతమగు ముహూర్తమున బాపూజీ తన పరివార ముతో నాశ్రమమున కరుగుదెంచెను. గురుదేవుఁడీ బృందమునకు స్వాగత మొసఁగి, మహాత్ముని చందనతాంబూలమాలలతో సత్క రించెను. అనంతరము గురుదేవుఁడు. వారల నలంకరించిన యతిథి గృహమునకుఁ గొంపోయెను. నేత్రోత్సవ మొనర్చు నా యలం కరణములకు బాపూజీ ముగ్ధుఁడాయెను. దరిద్రనారాయణుఁ డగు నతఁడు తనకట్టి పృథగ్గౌరవము పనికిరాదని భావించెను. అంత వారిరువురికిని జరిగిన సంభాషణ చమత్కారభరితమై హృదయముల నలరించునది :

మహాత్ముఁడు : ఈ యలంకరణములన్నియు నేమి ? నన్నీ వివాహ మందిరమున కేల తెచ్చితిరి ?

గురుదేవుఁడు: ఇది సౌందర్యోపాసకుఁడగు కవి నికేతనము కదా! ఇది మీకై యలంకరింపబడిన వివాహమందిరమే!

మహాత్ముఁడు: అయిన మఱి పెండ్లికూఁతు రెక్కడ?

గురుదేవుఁడు: సౌందర్యరాశియైన శాంతినికేతనకన్య మీ కిదే దివ్యనీరాజనము సందించుచున్నది;

మహాత్ముఁడు: ఈ ముదుసలి బోసినోటివాని నాలేఁబ్రాయపు మిటారి కన్నెత్తి కాంచుటకైన కనికరించునో లేదో!!

గురుదేవుఁడు: మా దేవి బాహ్యసౌందర్యములఁ బాటింపదు. సత్యోపాసకులే యామెకు సౌందర్యమూర్తులు.

సంభాషణ మింతటితో ముగిసినది. మహాత్ముఁడు మందిరము ప్రవేశించెను. మఱునాఁ డుదయముననే గురుదేవుఁడతిథులను బరామర్శించుటకు రాగా తోరణము, లలంకరణములు మాయమైనవి. రవీంద్రుఁ డావేదనముతో "అయ్యో! వివాహమందిర మేస్థితికివచ్చినద"ని విచారించెను. "గురుదేవా! నే నదివఱకే మనవిచేసితినికదా! ఈబోసినోటివాని నా పడుచు కన్నె వరించునా" యని మహాత్ముఁడు చమత్కరించెను. ఇరువురును బరస్పరాలింగనములతో విఱుగఁబడి నవ్వికొనిరి. పరివారమువారు సంభ్రమలోలురై చూచుచుండిరి. మధుర గర్భితమగు నీ సరస సంభాషణముల నాలకించుటకు దేవత లేవృక్షముల చాటున నొదిగిరో గదా!!"

"ఓ కవీంద్రా! ఓ మహాత్మా! ఓ వినిర్మల సింధూ పూరమా!! ఓ పవిత్ర గంగాప్రవాహమా!! మీ యిరు

వురి సమాగమము సత్యసౌందర్యముల సమైక్యము. ఓ మహాత్మా! యకుంఠిత కర్మవీరుఁడ వీవు!! అమేయమగు నాత్మత్యాగస్వరూపుఁడవు!!! ఓ విశ్వకవీ! నీవు వినిర్మల కాంతిపూరిమవు! అనంత జ్ఞానస్వరూపుఁడవు!! మీరిరువురు భగవానుని యాత్మజులను. అసూయాద్వేషములఁ బోనాడి సత్యజ్ఞానములను లోకమున సుప్రతిష్ఠిత మొనర్చుట కవతరించిన దివ్యమూర్తులరు!!" అని ప్రపంచ సారస్వతేయుఁడగు 'రోమ్యారోలా'తో మనము నా యమరమూర్తులకు భక్త్యంజలి సమర్పింతము.

## ౧౯

గురుదేవునకు డెబ్బదియేండ్లు నిండెను. కలకత్తా నగరమున నాతని సప్తతిమహోత్సవ మతివైభవముగ జరిగినది. ఈ సందర్భమున నొక యభినందనగ్రంథము గురుదేవులకు సమర్పింపఁబడినది. అందు ప్రఖ్యాతిగన్న రచయితల గద్యపద్యవ్యాసములు కలవు. ప్రతివ్యాసమునను నీ యపరవ్యాసమూర్తి యఖండప్రతిభ యుగ్గడింపఁబడినది. ఈ యుత్సవములలో రవీంద్రుని నాటికలు ప్రదర్శింపఁబడినవి. ఆబాలగోపాలము నిత్యము తమ వృద్ధగురుమూర్తికి కృతజ్ఞతాంజలి సమర్పించుటకు వివిధప్రాంతములనుండి వచ్చినది. తరగని యుత్సాహముతో నీ జయంత్యుత్సవము లిట్లు జరుగుచుండగనే

'రౌండ్ టేబుల్' సమావేశానంతరము భారతదేశమునకు వచ్చిన గాంధీమహాత్ముని ప్రభుత్వము బంధించెననువార్త కర్ణకఠోరముగ వినవచ్చెను. ఈ వర్తమానమును వినగనే గురుదేవుని మానసము పట్టరాని యావేదనముతో పరిభ్రమించినది. ఉత్సవముల నాపుడని వెంటనే యాజ్ఞాపించి, ప్రభుత్వ విధానమును నిరసించుచు 'లండన్ టైమ్స్' పత్రిక కొక దీర్ఘలేఖను వ్రాసెను. కారలోనున్న గాంధీమహాత్ముఁ డింతలో మతసామరస్యసాధనకై నిష్ఠురమగు నుపవాసదీక్ష వహించెనని గురుదేవుఁడు విని, యొక్కచో నిలువలేక, స్వయముగ నెఱ్ఱవాడ కేగి, తన సానుభూతిని మహాత్మునకు నివేదించెను. "మీరు నిర్వహించుచున్న యుద్యమము మహత్తరమైనది, కడకాత్మబలిదానము మూలముననైన మీరు మహోన్నతలక్ష్యమును సాధించుటకు వెనుకంజ వేయవలద"ని యా త్యాగమూర్తిని గురుదేవు లాశీర్వదించిరి.

ఇంతలో మఱికొన్ని కష్టపరంపరలు వృద్ధమూర్తిని తాత్కాలికముగ కలవరపఱచినవి. ఇరువదియేండ్ల మనుమఁ డొకఁడు జర్మనీదేశమున విద్యాభ్యాసము గావించుచు మరణించెను. శాంతినికేతనాధ్యాపకుఁడు, తన కాప్తుఁడునైన పియర్సన్ అమరపురి నలంకరించెను. మఱి రెండేడ్లకు ముద్దుల మేనల్లుఁడు దినేంద్రుఁడు దివి కేగెను. తనగేయము లితఁడు పాడగావిని గురుదేవుఁడు ప్రమోదమందెడివాఁడు. జీవితములోని ద్వంద్వముల కొక్క రమ్యాకృతిని కల్పించుకొని,

సుఖదుఃఖములను లీలామాత్రముగ ననుభవింపఁగల్గిన రవీంద్ర గురుదేవులపై మృత్యుదేవత కురిపించిన మారణాస్త్రములు శక్తిహీనములే యైనవి.

దేశము నాల్గుమూలలనుండి గురుదేవుల కనేకాహ్వానములు వచ్చుచుండెడివి. తన సోదర దేశీయులు తనయెడజూపు గౌరవప్రపత్తుల స్వీకరింపనిచో వారు చిన్నబుచ్చుకొందురని వీలు కల్పించుకొని, ఆయా దేశముల కేగి పండిత పామర సమావేశములలో తన యమూల్యమగు సందేశమును వినిపించుచుండెను. ఈ సందర్భమున ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకు రవీంద్ర గురుదేవుఁడు వచ్చి 'మానవుఁడ'ను విషయముపై మూఁడుపన్యాసముల నొసఁగెను. పందొమ్మిదివందల ముప్పదియాఱులో నైరోపాలో జరిగిన ప్రపంచ శాంతి సమావేశమునకు, వారి కోరికపై గురుదేవు లిట్లు తన సందేశము నంపెను: "బలవంతులు దురాశాపీడితులు కానపుడే ప్రపంచ శాంతి. బలహీనులు ధైర్యస్థైర్యములతో సంచరించుట నేర్చుకొనవలయును." అల్పాక్షర పరిమితమైననీ యనల్పార్థ సందేశమును విని పాశ్చాత్య మేధావులు శాంతికాముకుఁడగు గురుమూర్తి కభివాదములు సమర్పించిరి.

మఱుసటి సంవత్సరము కలకత్తా విశ్వవిద్యాలయ స్నాతకోపన్యాసమును తన మాతృభాషయందొసఁగి నూత్నమగు సంప్రదాయము నేర్పఱచెను. వివిధ విశ్వవిద్యాలయములు

గురుదేవునకు గౌరవబిరుదములొసఁగి, తమ్ము తాము గౌరవించు కొనినవి.

ఇంతటి వయసునను గురుదేవుఁడొక్కక్షణమైన వృథా సేసి యెఱుగఁడు. తనమాటలకందని భావములను చిత్రములందు వ్యక్తీకరించుచుండెడివాఁడు. ఈ యీడుననే "విశ్వపరిచయము"ను శాస్త్రీయగ్రంథము నీతఁడు రచించెను. ఈ ప్రాయముననే వంగభాషకొక వ్యాకృతిని రచించి, తద్భాషాభిలాషులకు మేలు చేకూర్చెను.

ఇంతలో నాక్సుఫర్డ్ విశ్వ విద్యాలయమువారు గురుదేవునకు "డాక్టరు" గౌరవబిరుదము నొసఁగి యఖండముగ సత్కరించిరి. విశ్వభారతియందే యీ బిరుద ప్రదాన మతి నైభవముగ జరిగినది. "మారీగయర్", "సర్వేపల్లి రాధాకృష్ణ" పండితులిరువురు దీనిని నిర్వహించిరి. సభాకలాపము లాటిన్ భాషలో జరిగినది. గురుదేవుఁడు సంస్కృతభాషలో తనప్రత్యుత్తరము నొసఁగెను. ప్రాక్పశ్చిమ పూర్వనాగరకతలిట్లు తమ్ము పలుకరించుకొనుట చూచి సమస్త పండితలోకమోహాహో! యని ప్రమోద బాష్పము లురలినది.

గురుదేవున కెనుబది వసంతములు నిండినవి. జన్మదినోత్సవ మతినిరాడంబరముగ శాంతినికేతనమున జరిగినది. "విశ్వభారతి" ప్రత్యేకసంచిక యీ సందర్భమునఁ బ్రకటింపఁబడినది. మహాకవిత్వ దీక్షావిధితో శతాధికముగు గ్రంథముల రచించిన యీవృద్ధ సారస్వతతపస్వి, యీ నవయుగ ధర్మప్రవక్త తన

యీ జన్మదినోత్సవ సందర్భమున "జన్మదినే" యను గేయ
మును గూర్చెను. అందా బ్రహ్మణ్యమూర్తి తనకవిత్వ ప్రయోజనము పరిమితమైనదని గ్రహించి, ప్రగతిశీలుండగు నొక నవకవిని వినమ్రతతో నిట్లాహ్వానించెను :

"ఓ నవకవీ! ఓ యువకవీ!! నీ కిదేనాయాహ్వానము. నీ కివే నాయభివందనములు. ఇన్నినాళ్ళుగా నేనవలోకించిన ప్రకృతి, యనంతప్రకృతిలో నొకఖండము మాత్రమే. ఈ విశాల విశ్వసాగర సంగీతము నన్నాహ్వానించినది. అందలి కెరటములు నన్ను లోనికి గొంపోయి నా కీజగద్రహస్యము నుద్బోధించినవి. దేశదేశాంతర కవుల ప్రాభాతగానమున నాకంఠస్వరమును నైక్యమొనర్చితిని. కాని నాకిది యాత్మతృప్తి నొసంగలేదు. పొలము దున్నెడిరైతులు, వలలపన్నెడు జాలరులు, తడికలల్లెడి మేదరులు, సమ్మెటగొట్టు కమ్మరులు, కష్టించి శ్రమించి ఘర్మజలమునోడ్చి యీ జగస్థితికి తోడ్పడుచున్నారు. వారిలో నొకండనై కలసి మెలసి, వారి చరిత్రలను కావ్యవిషయములు గావించుట నాకశక్యమైనది. నాజీవితవిధానము నన్నున్నత శిఖరముల నిలువబెట్టి క్రిందికి దిగనీయలేదు.

"ఓ యువకవీ!! ఓ నవకవీ!!! నీవైనను వారిలో నొకండవై, వారి జీవనానుభవముల గమనించి, వారి మూకకంఠములకు నీగేయములను ప్రాతినిధ్యము వహింపనిమ్ము!!"

జన్మదినోత్సవము పూర్తియైననాంటినుండి గురుదేవుండతి నీరసముగ నుండెను. తఱుచుగా జ్వరపీడితుండై బాధపడు.

సంచెను. మిత్రులు, శిష్యులు పలురీతులఁ బరిచర్య ల్పుచుండిరి. నానాఁటికి గురుదేవుని జీవితముపై వా రాశలు దలుకొనుచుండిరి. పంతొమ్మిదివందల నలుబదియొక్క సంవ త్సరము జులై మాసము గురుదేవుఁడు కలకత్తానగరమున తన స్వగృహామునకుఁ జేర్చఁబడెను. ఆగస్టుమాస మేఁడవదినముననే పూజ్యమూర్తి యతిప్రశాంతముగ తన తుదినిశ్వాసమును వదలెను. గంగాతీరమున 'నింటోలా' ఘట్టమున నాతని భౌతిక దేహము పంచభూతముల విలీనమైనది.

"ఈ నాయంతిమ ప్రయాణసమయమున నా సుహృ ద్బాంధవలోకమున కివే నా యాశీస్సులు. వినీల వియత్పథమున నా మార్గము కంటకరహితమై నా యానమున కనుకూలముగ నున్నది. నే నేమి వెంట గొంపోవలయునో నాకు తెలియదు. రిక్తహస్తములతో, నిండుహృదయముతో నా ప్రయాణమును సాగింతును. నా జీవితమన్న నాకు మక్కువ మిక్కుటము. అందుచే మృత్యువునుగూడ నేను ప్రేమింతును" అని తన యంత్యసందేశమును మందస్వరమున వినిపించెను.

గురుదేవుని యస్తమయమున ప్రాక్ప్రతీచీ విజ్ఞాన భాస్కరుఁ డస్తమించి నట్లాయెను. శోకాంధకారము నలుదెసల నలముకొన్నది. దేశదేశాంతరము నందలి కవులు తమ గురుమూర్తి కశ్రుతర్పణమును విడిచిరి. ప్రపంచ సారస్వత పత్రికలు తమ ప్రభువునకుఁ బ్రత్యేక విషాదరూపముల తుది ప్రణామము గావించినవి.

"టాగూరు మరణవార్త నన్నెంతగనో వ్యాకులపఱచినది. ముదుసలి మునీంద్రుఁ డిఁక లేఁడు. ఆ మహాత్ముని యమర సందేశమును వినుభాగ్యమునకు మనము నోఁచుకో లేద"ని చాంగ్-కై-షేక్ పరితపించెను. "అమరకవి ఛాయాచిత్రమును ప్రతిగ్రంథాలయమున నలంకరించి యారాధింపుఁడ"ని బెర్నార్డ్ షా తన దేశీయుల హెచ్చరించెను.

"రవీంద్రుఁడు విశ్వకవిమాత్రుఁడే కాక వాల్మీకి, వ్యాసాదులను బోలిన గురుదేవుఁడు. అతని యంతరాత్మ యజరామరణమైనది. అతఁడు భారతదేశోద్ధరణమున జగదుద్ధరణమునకే యత్నించెను. శాంతినికేతనము, శ్రీనికేతనము, విశ్వభారతి యను నీ త్రిమూర్తులుగా గురుదేవుఁడు మనకు నిత్యము సాక్షాత్కరించుచునే యున్నాఁడు. ఈసంస్థలను బరిరక్షించుటయే మనము గురుదేవులయెడ కృతజ్ఞులమైయుండుట" యని యుగపురుషుఁడగు గాంధీమహాత్ముఁ డీ పురుషోత్తమునకు భక్తిమెయి యశ్రు లరలెను.

"గురుదేవుని యస్తమయముచే నంధకారము మనల నలముకొన్నది. భారతీయాంబరమున జ్వాజ్వల్యమానముగఁ బ్రకాశించు నీ ధృవతార సమస్త జగత్తునకు వెల్గుబాటల వెలార్చినది. గతకాల భారతీయవైభవమును, వర్తమానకాల కర్తవ్యజ్ఞానమును, భవిష్యత్కాలాభివృద్ధి పద్ధతి నీ వృద్ధమూర్తి మనకుఁ బ్రసాదించెను. సంతత జగత్కల్యాణ చికీర్షకులగు భారతీయ ఋషిసంతతికిఁ జెందిన యీ యాధునిక ఋషి,

సత్తముఁడు సాధించిన ఘనవిజయములకు మనము గర్వింప వగును. కాని తద్గరిష్ఠస్మృతితో విశ్వభారతి యభివృద్ధికి మనము సంతతము సాయపడుట మానరాద"ని భారత జాతి నాయకుఁడు, విశ్వభారతి ప్రస్తుత గౌరవాధ్యక్షుఁడగు నెహ్రూ పండితుఁ డానాఁడు సోదరాళికీ కర్తవ్యమును దెలియఁజెప్పెను.

కవికోకిల సరోజినీదేవి తన కవితాజనకుఁడగు రవీంద్రుని మృతి కిట్లు విలపించెను. "ఆతని యద్భుత జీవితగాథ యొక దివ్యకథగా భవిష్యత్కాలమున నలరగలదు. అతఁడు గతించినను నతని గానము వసంతకాలపు తొలిపూవువలె నవ్యమైనది. ఒక గొప్ప 'తోటమాలి' దాటిపోయినాఁడు. కాని యాతఁడు పూయించిన సౌందర్యగీతికా పుష్పములు మాత్రము శాశ్వతముగ గుబాళించును!"

## ౨౦

ఓ విశ్వకవీ!! ఓ సౌందర్యతపస్వీ!! ఓ దివ్యమహర్షీ!! ఓ పూజ్య గురుదేవా!! నీ యవతారము భారతీయ వైజ్ఞానిక చరిత్ర కొకనూతనాధ్యాయము. మానవత్వ చరిత్ర కొకమంజుల గానము. నీవు పలికినదెల్ల కవిత్వము. నీవు తలఁచిన ప్రతి భావము విశ్వతాపహారమైనది. నీవు గీచినగీటు చిత్రమైనది. నీవు సలిపిన ప్రతి కర్మము సర్వమానవ సౌభాగ్యప్రదమైనది.

నీ విలాసము లనంతములు. వానిని స్మరించినపుడు మా లోని రసభావస్రవంతు లుప్పొంగును.

ఒకప్పుడు నీవు రసోన్మాదమున, రమ్యప్రేమోద్యానముల విహరించుచు పుంస్కోకిలలతోఁ గంఠమెత్తి కుహూ కుహూ రావములఁ బూరించితివి. ఇంకొకప్పుడు శాంతగంభీరమగు సంధ్యాసమయమున సరససల్లాపములతో సంచరించు కేకి దంపతులతో కేకిసలనాడెదవు. మఱొక్కవేళ నెలవంక ('Crescent Moon') జిలిబిలి లేత వెన్నెలలో పసిపాపలను ముద్దిడుకొని వారి చిద్విలాసముల శాశ్వతీకరింతువు. వేఱొక్క శుభప్రాభాతిక ముహూర్తమున నేకాంతమున ప్రకృతిమాతకు మోకరిలి నిత్యమామె ప్రేమోద్యానమునకుఁ దోటమాలిఁ (Gardener) గావింపుమని ప్రార్థింతువు. వెన్వెంటనే నీ యారామమున పచేళిమమైన మధురఫలముల గంపకెత్తి (Fruit-Gathering) విశ్వసహృదయులకు నాస్వాదనార్థ మాయత్త పఱతువు. ఇంతలో విసీలాకాశమున విహరించు విహంగములకు (Stray birds) క్రమశిక్ష నేర్పింతువు. అటు చూచుచుండగనే ముముక్షువులతోఁ జేరి జీవిత లక్ష్యసాధన కాత్మార్పణమే (Sacrifice) శరణ్యమని యుపదేశింతువు. అంతట పర్వత సానువుల కెగబ్రాకి మహాత్ములతో తపమాచరింతువు. ఒకింత తడవునకే వాని నధిరోహించి శ్రామిక జీవుల ఘర్మబిందువులకు నీ కన్నీటి బిందువులను దోడు జేసెదవు.

నీవొక కవివి. నీవేకైక విశ్వకవివి! నీవు మాపాలిటి కల్పవల్లివి !! నీవు నవయుగ ధర్మప్రవక్తవు!!! నీ వమర వైతాళి కుఁడవు!!! నీవు మరణించితివన్న మేము విశ్వసింపము. ఖేద మోదములతోఁగూడిన కాలమను చెలికానితో దాగుడుమూత లాడుచుంటివేమో !!

రససిద్ధితో విజయోన్నతులగు సుకవీంద్రుల కీర్తి శరీరము లజరామరణములుకదా !! నీజీవిత గాంధర్వగానము మాకు నిత్య నూతనములగు జీవంజవముల నాపాదించుగాక !! నీకు మాజోహారులు !!!

దేశభక్తి ప్రఫుల్లములగు నీ గేయములలో మణిపూస వంటి గేయభావము మాకు నిత్య సంస్మరణీయమగు గాక !!

"ఓ తల్లి! నీకై నా దేహము నర్పింతును. నీకై నాజీవి తము నంకిత మొనర్తును. నీ సందర్శన సౌభాగ్యమునకే నానేత్ర ముల వినియోగింతును. నేఁడు నాయాయుధములు దుర్బల ములు. అయినను నీ యాదేశమును నిర్వర్తించుట కేమాత్రము వెనుదీయను. నేఁడు నా కరవాలము త్రుప్పుపట్టినది. అయ్యును నిన్ను బంధించిన శృంఖలముల విచ్ఛేద మొనర్చుటకు జంకనే జంకను.

ఓ తల్లి!! పవిత్రమగు నీ గర్భవాసమునఁ బుట్టినందులకు నా జీవితము పావనమైనది. నిన్ను మనసార ప్రేమింపఁగల్గి నందులకు నా జన్మ సార్థకమైనది. మహారాణికివలె నీకు భోగభాగ్యము లున్నవేమో! నాకు తెలియదు. కాని

నీ సన్నిధిని నిల్చినంతనే నా సర్వావయవములు శక్తిహీనములై నీలో విలీనమందును. నీ వలంకరించిన యే దివ్యసుమసౌరభము నా యాత్మ నిట్లు వశపఱచుకొన్నదో నే నెఱుఁగను. ఏ వినిర్మలాకాశమునందలి జ్యోత్స్నాప్రభావము నా కీ స్థితిఁ గల్పించినదో చెప్పలేను.

ఓ పవిత్రభారత జననీ! నీ దివ్యజ్యోతిలోఁ దొలిసారిగా కన్నులు తెఱచితిని. ఆ దివ్యజ్యోతియందే కడసారిగా గన్నుమూయుదును!!! "

ఓం.

సత్యమ్! శివమ్!! సుందరమ్!!!